### శ్రీ నిఖిల తంత్రాలు

# శ్రీ పాశుపత మహాతంత్రం

(366 పాశుపత మంత్రాలు-వాటి ప్రయోగ విధానాలు)

## AUTOMIC POWER OF PASUPATHAMISSILE


మంత్ర వ్యాఖ్యాత :

**శ్రీ స్వామి మధుసూదన సరస్వతి**

సహాయకులు :

బ్రహ్మశ్రీ పేరి భాస్కరరాయశర్మ

[illegible]

## పాశుపత విషయసూచిక

## సర్వాంగరోగ నివారణ పాశుపతాలు





## శ్రీ శివ పాశుపతాలు

## అథర్వణ పాశుపతాలు

# 366 పాశుపతాలు (ప్రయోగ విధానాలు)

**1. వర్ష పాశుపతం :**

"నమో రుద్రేభ్యో యే దివి యేషాం వర్షమిషవ స్తేభ్యో మీఢుష్టమాయ నమః

**విధానం :** పంచామృతాలు, నారికేళ జలం, సమంత్రిత మంత్ర జలంతో రుద్ర సంపుటీకంలో మండలం రోజులు అభిషేకం చేస్తూ బిల్వదళార్చన క్షీరాన్న నివేదన చేయాలి.

**ఫలం :** తప్పక వర్షం పడుతుంది. వర్షాభావంవల్ల పంటలు ఎండిపోతున్న సమయంలో ఈ ప్రయోగంతో నేను అనేకసార్లు వర్షం పడేలా చేశాను.

## జ్వర పాశుపతాలు

**2. ఇంద్రాక్షీ పాశుపతం :**

"భస్మాయుధాయ విద్మహే రక్తనేత్రాయ ధీమహి తన్నో జ్వరః ప్రచోదయాత్"

**విధానం :** భస్మాభిషేకం, అష్టపుష్ప – బిల్వపత్రపూజ, మాషచక్ర (మినుములతో వండిన తీయని వంటకం) నివేదన.

**3. ముకుటేశ్వరీ పాశుపతం :**

"ఓం ముం ముకుటేశ్వరీభ్యామ్ నమః"

**విధానం :** పైన వ్రాసినట్లే.

**4. జ్వరకవచ పాశుపతం :**

"ఓం నమో భగవతి వజ్రశృంఖలే హన్తు భక్షతు స్వాదతు అహోరక్తం పిబ,కృపాణేన రక్తాక్షి, రక్తపటే, భస్మాక్షి భస్మలిప్త శరీరే, వజ్రాయుధప్రకర నిచితే, పూర్వాన్దిశం బధ్నాతు, దక్షిణాన్దిశమ్ బధ్నాతు, పశ్చిమాన్దిశమ్ బధ్నాతు, నాగార్థ ధనాయ గృహపతీన్ బధ్నాతు, నాగపటీం బధ్నాతు, యక్షరాక్షస పిశాచాన్ బధ్నాతు, ప్రేత భూత గంధర్వాదయో యేయే కేచిత్ పుత్రికా స్తేభ్యో రక్షతు, ఊర్ధ్వం రక్షతు, అధోరక్షతు, స్వనికాం బధ్నాతు, జలమహాబలే, ఏహ్యేహి, తులోప్టే లోప్టే శతావతీ వజ్రాగ్ని వజ్రప్రకరే, హుం ఫట్, హ్రీం హ్రీం శ్రీం ఫట్, హుం హుం క్రూం ఫం ఫం సర్వగ్రహేభ్యః, సర్వదుష్టోపద్రవేభ్యో హ్రీం, అవశేషేభ్యో మాం రక్షతు."

ఇతీదం కవచం దేవి సురాసుర సుదుర్లభమ్
గ్రహజ్వరాది భూతేషు సర్వకర్మసు యోజయేత్.

**విధానం :** పైమూడు (2,3,4) జ్వరనివారణ కొరకు ప్రయోగించాలి. వైరస్ జ్వరాలు, టైఫాయిడ్, మలేరియా, బ్రెయిన్‌ఫీవర్ మొదలైన ఎటువంటి మొండిజ్వరమైనా రోజులు తరబడి బాధిస్తున్నప్పుడు గోమూత్రం ఇల్లంతాచల్లి, జ్వరంతో ఉన్నవ్యక్తిని కూడా గోమూత్రంతో తుడిచి పై మూడు మంత్రాలతో జ్వరాన్ని నివారించవచ్చు. సుదీర్ఘంగా నెలరోజులనుండి బాధిస్తున్న జ్వరాలను కూడా నేను ఈవిధంగా అంతంచేశాను. జ్వరములో పీడకలలూ మొదలగునవన్నీ చక్కబడతాయి.

## 5. కన్యా పాశుపతం :

**"పావీరవీ కన్యా చిత్రాయుస్సరస్వతీ వీరపత్నీ ధియం ధాత్ జ్ఞాభిరచ్ఛిద్రగ్ం శరణగ్ం సజోషా దురాధర్షం గృణతే శర్మయగ్ం సత్"**

**విధానం :** శర్కరాభిషేకం, కరవీర పుష్పపూజ, చక్కెర పొంగలి నివేదన.

**ఫలం :** ఇష్ట కన్యా ప్రాప్తి. 35 సం॥ వయసు వరకు కూడా వివాహంకాని ఎంతో మంది వరులు ఈ ప్రయోగంతో గృహస్థాశ్రమంలోకి ప్రవేశించారు. దీని వలన ఎన్ని గ్రహదోషాలున్నా తొలగి తప్పక వారికి వివాహం జరుగుతుంది.

## 6. అఘోర గౌరీ పాశుపతం :

**"అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః సర్వేభ్యః సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః, అఘోర గౌర్యై నమః**

**విధానం :** పై విధంగా

**ఫలం :** ఇష్టవరప్రాప్తి. కావలసిన వరుడు లభిస్తాడు. ఏదోషం వలన అయినా సుదీర్ఘకాలం వరకు వివాహంకాని కన్యలకు ఈ ప్రయోగంతో గృహిణులుగా మార్చవచ్చు. భక్తిశ్రద్ధావధానముతో యీ మహామంత్రాన్ని జపించాలి. అటువంటి వారికి గొప్ప ఫలితము లభిస్తుంది.

## 7. సంతాన పాశుపతం :

**"కాణ్డాత్ కాణ్డాత్ ప్రరోహన్తీ పరుషః పరుషః పరి ।**
**ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ ॥"**

**విధానం :** పంచామృత దూర్వోదక అభిషేకం, క్షీరాన్న, అపూప (సత్తుపిండి) నివేదనం, అష్టపుష్పబిల్వపత్ర పూజ. ఈ దివ్య మంత్ర జపము గావించిన తప్పక సంతానం కలుగును.

**ఫలం :** సంతాన ప్రాప్తి. కడుపు పండలేదని బాధపడుతున్నారా? ఈ మంత్రం మిమ్ముల్ని సంతానవంతులను చేస్తుంది. ఈ పాశుపత మహామంత్రము వలన పైన చెప్పినవన్నీ జరిగి యింకా గ్రహదోషాలేమైనా ఉన్న తొలగిపోతాయి.

## 8. నవగ్రహ పాశుపతం :

**"ఓం హర, క్లీం మహేశ్వర, శ్రీం శూలపాణి, ఐం పినాకధృత్, హ్రీం పశుపతి, గ్లౌం శివ, రం మహాదేవ, హుం ఈశాన, నమః శివాయఫట్; ఓం శ్లీం పశుహుం ఫట్.**

**విధానం :** పంచామృతాభిషేకం, బిల్వపత్ర అష్టపుష్పపూజ, క్షీరాన్న నివేదన.

**ఫలం :** గ్రహానుకూలత. ఉద్యోగం దొరకడంలేదా ? దారిద్ర్యం మిమ్మల్ని వెంబడిస్తోందా? లేకవచ్చిన డబ్బు నిలవడంలేదా? డబ్బు మంచినీళ్ళులా ఖర్చుఅవుతోందా ? అనారోగ్యంతో బాధపడుతున్నారా? ఎవరూ మీ మాట వినడంలేదా ? అవమానాలపాలవుతున్నారా? ప్రతిరోజూ దెబ్బలు తగులుతున్నాయా ? ఆక్సిడెంట్లు అవుతున్నాయా ? ఇది ఏలినాటి శనిదోషమా? రాహుమహర్దశా దోషమా? కుజదోషమా ? జ్యోతిషుడు ఈవిషయము చెప్పి ఉండకపోవచ్చు. లేదా మీకు ఈవిషయం తెలియకపోవచ్చు అయినా పై సమస్యలలో ఏ ఒక్క సమస్య మిమ్మల్ని బాధిస్తున్నా సరే మీరు నవగ్రహాలను శాంతపరిచే, దారికితెచ్చే పై పాశుపతప్రయోగం చేయండి మీకష్టం తొలగిపోతుంది.

## 9. నృసింహ పాశుపతం :

**"ఓం నమో భగవతే నరసింహాయ హిరణ్యకశిపు వక్షస్థల విదారణాయ, త్రిభువన వ్యాపకాయ, భూతప్రేత పిశాచ శాకినీ డాకినీ కులోన్మూలనాయ, స్తంభోద్భవాయ, సమస్త దోషాన్ హరహర, విసర విసర, పచపచ, హనహన, కంపయ కంపయ, మథ మథ, హ్రీం హ్రీం హ్రీం ఫట్ ఫట్ ఠః ఠః, ఏహ్యేహి రుద్ర అజ్ఞాపయామి స్వాహా; ఓం హ్రీం హ్రీం హ్రీం, హుం హుం హుం ఫట్ స్వాహా".**

**విధానం :** చెరుకురసం, బెల్లం పానకంతో అభిషేకం, ఎఱ్ఱనిపూలతో అర్చన, వడపప్పు పానకం కొబ్బరికాయ నివేదన.

**ఫలం :** సమస్త భూతప్రేత పిశాచ బాధానివారణ. (తమిళనాడులోని సీర్కాడి అనే చిన్నపట్టణంలో ఉన్న సట్టైనాదర్ మందిరంలో 1 శుక్రవారం రాత్రికి సిద్ధిస్తుంది. అక్కడ వారానికి 1సారి ప్రతి శుక్రవారం రాత్రి 10.30 నుండి 12 గంటల వరకు పూజ జరుగుతుంది. అనేకసార్లు బ్రహ్మరాక్షసాది ప్రత్యక్ష భూతప్రేతసమస్యలు కనిపించినచోట ఈ పాశుపతప్రయోగంతో నేను విజయం సాధించాను. గోదావరిఖనిలోని ఒక ధనవంతుడి సమస్యల నన్నింటికీ నేను ఈ పాశుపతంతో దూరం చేయగలిగాను. (ఆయన నృసింహ మందిరం నిర్మిస్తానని మాట ఇచ్చి-ఇంకా ఆపని చేయలేదు.)

## 10. భ్రామరీ పాశుపతం :

**"ఓం ఆం హ్రీం సౌం ఐం క్లీం హూం సౌః గ్లౌం క్రోం ఏహిఏహి భ్రమరాంబాఏహి సకల జగన్మోహనాయ మోహనాయ సకలాండజ పిండజాన్**

భ్రామయ భ్రామయ రాజా ప్రజావశంకరి సంమోహాయ సంమోహాయ మహామాయే అష్టాదశపీఠ రూపిణి అమల వరలయూం స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ప్రస్ఫుర కోటి సూర్యప్రభా భాసురి, చంద్ర జూటీ, మాం రక్ష రక్ష మమ శత్రూన్ భస్మీ కురు భస్మీకురు విశ్వమోహినీ హుం క్లీం హుం హుం ఫట్ స్వాహా"

**విధానం :** ఖర్జూర ఫల రసాభిషేకం, జమ్మిపత్రిపూజ, మాషచక్ర నివేదన; రాత్రి 9 గంటల నుండి 12 గంటల లోపల దక్షిణ ముఖంగా చేయాలి. శత్రువులు శత్రువుల రూపంతోవస్తే వారిని భౌతికంగా ఎదుర్కోవడం చాలాసులభం కానీ, వారు మిత్రుల రూపంలో, బంధువుల రూపంలోవస్తే! ఎదురుగా తీయగా మాట్లాడుతూ వెనుక గోతులు తవ్వుతూ ఉంటే! ఆవ నూనెతోగాని, నువ్వుల నూనెతోగానీ అఖండ దీపం వెలిగించండి 40 రోజులు నిష్ఠగా రాత్రిపూట ఈ పాశుపత ప్రయోగంచేయండి. మీ శత్రువులంతా నశిస్తారు. ఈ శాత్రవవిజయ మహామంత్రము జపము వలన మిత్ర– ఆప్తరూప శత్రువులు పూర్తిగా నశించి, సాధకుని జీవితమంతా అపూర్వ వైభవముతో ఉండును.

**ఫలం :** సకల శత్రుబాధా నివారణ.

## 11. హనుమత్ పాశుపతం :

**ఓం నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమశ్శూరాయ చావభిన్దతే చ**
**సంస్పృష్టం ధనముభయం సమాకృతమ్ ।**
**అస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యుః ।**
**భియం దధానా హృదయేషు శత్రవః**
**పరాజితాసో అపనిలయంతామ్ ॥**
**ఖేం ఖేం హరిమర్కట మర్కటాయ స్వాహా.**

**విధానం : ఫలం** – పైవిధంగానే. (శత్రుసంహారమేకాక ధనప్రాప్తి కూడా కలుగుతుంది.) ఈ మంత్రము మహాశక్తి గలిగినది. హనుమత్ దివ్య దీవెన గలిగి, ధనధాన్యాదులు కలిగి, దీనితో శత్రువులందరూ నశించి, సాధకునకు అన్ని విధాలా ఆనందాన్నిచ్చును.

# మార్కండేయ పాశుపతాలు

## 12. మృతసంజీవనీ పాశుపతం :

"ఓంహ్రాం జూం సః ఓం భూర్భువః స్వః ఓం తత్సవితుర్వరేణ్యం త్ర్యంబకం యజామహే భర్గోదేవస్య ధీమహి సుగంధిం పుష్టివర్ధనం ధియోయోనః ప్రచోదయాత్ ఉర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ ముక్షీయ మామృతాత్ ఓం స్వః భువః భూః ఓం సః జూం హ్రౌం ఓం.

## 13. మృతసంజీవనీ మహామృత్యుంజయ పాశుపతం :

"ఓం హ్రౌం ఓం జూం ఓం సః ఓం భూః ఓం భువః ఓం స్వః ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ ముక్షీయ మామృతాత్ ఓం స్వః ఓం భువః ఓం భూః ఓం సః ఓం జూం ఓం హ్రీం.

## 14. మహామృత్యుంజయ పాశుపతం :

"ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుకమివ బంధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ భూర్భువస్సువరోం జూం సః హౌం ఓం

**విధానం :** పై మూడు (12,13,14) మార్కండేయ పాశుపతాలు ఏవైనా ఐదురకాల పండ్ల రసాలతో, మూలికారసాలతో అభిషేకిస్తూ, ఉమ్మెత్తపూలతో అర్చిస్తూ, అరటిపండ్లు, కొబ్బరికాయ నివేదిస్తూ 41వరోజు గుమ్మడికాయను బలి ఇవ్వాలి.

**ఫలం :** అపమృత్యుదోషం, భయంకరమైన రోగాలు నివారించ బడతాయి. విజయవాడలోని అమరా వెంకటేశ్వర్లు అనే డాక్టర్‌గారికి నేను ఈ మంత్రాలతో వైద్యం చేసి, ఆపరేషన్‌కు సిద్ధంగావున్న మూత్రపిండాలు తిరిగి పనిచేసేలా చేశాను. దీని జపము వలన ఎన్నాళ్ల నుండి ఉన్న దీర్ఘరోగాలైనా తప్పక నశించి ఆరోగ్యము కలుగుతుంది.

## 15. కుబేర పాశుపతం :

"ఓం రాజాధిరాజాయ ప్రసహ్యాసాహినే నమో వయం వైశ్రవణాయ కుర్మహే సమే కామాన్ కామ కామాయ మహ్యం కామేశ్వరో వైశ్రవణో దధాతు కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః ఓం నమో యక్షాయ కుబేరాయ వైశ్రవణాయ ధనధాన్యాధిపతయే ధనధాన్య సమృద్ధిం మే దేహి దాపయ స్వాహా."

**విధానం :** నారికేళ జలాభిషేకం, దానిమ్మపండ్ల నివేదన, తెల్లని పూలతో అర్చన. (లేదా ఆవునెయ్యి అభిషేకం)

ఫలం : ధనప్రాప్తి. ఈ పాశుపత ప్రయోగంతో నేను అనేకమంది ధనసమస్యలు దూరం చేశాను. ఈ మంత్ర జపమువలన ధనహీనులు కుబేరులై ఉంటారు.

## 16. సిద్ధ అఘోరాస్త్రం :

**"ఓం నమః పశుపతయే ఓం నమో భూతాధిపతయే ఓం నమో రుద్రాధిపతయే ల,ల,ల,ల, ఖడ్గ రావణ, విహర విహర,సరసర, నృత్య నృత్య, శ్మశాన భస్మార్చిత శరీరాయ ఘంటాకపాల మాలాధరాయ వ్యాఘ్రచర్మ పరిధానాయ శశాంక కృత శేఖరాయ కృష్ణసర్ప యజ్ఞోపవీతినే చిలచిల బల బల అనివర్తకపాలినే హనహన భూతాం స్త్రాసయ-త్రాసయ మండల మధ్యే ఫట్ రుద్రాంశేన శమయ,శమయ ప్రవేశయ ప్రవేశయ, ఆవేశయ ఆవేశయ చండాసిధరాధిపతి రుద్రోజ్ఞాపయతి స్వాహా.**

**ఓం నమోభగవతే త్ర్యంబకాయ శూలపాణయే రుద్రాయామృతమూర్తయే మాం జీవయ చంద్ర జటిలాయ త్రిపురాంతకాయ హాం హ్రీం రుద్రాయ ఋగ్ యజు స్సామ లోపాయఅగ్ని త్రితయాయ జ్వల జ్వల, ప్రజ్వల ప్రజ్వల మాం రక్ష రక్ష, అఘోరాస్త్రాయ హుం ఫట్ స్వాహా.**

**విధానం :** భస్మాభిషేకం-సర్వలింగ స్థాపనమంత్రం చదువుతూ నిమ్మకాయలతో అర్చించాలి. గుమ్మడికాయ నివేదించాలి. పూజానంతరం వీధి గుమ్మంలో గుమ్మడికాయ బలి ఇచ్చి నిమ్మకాయలు ద్వారబంధానికి కట్టాలి.

**ఫలం :** గాలి, ధూళి, దృష్టి దోషాలు తొలగిపోతాయి. భూత భేతాళాదులు ఈ మంత్ర శక్తివలన తప్పక తొలగును.

## 17. మహాపాశుపతం :

**"ఓం క్రాం క్రీం క్రోం ఘ్రుం కఏఈలహ్రీం నమశ్శంభవేచ మయోభవేచ నమః శంకరాయచ మయస్కరాయచ నమః శివాయచ శివతరాయచ."**

**విధానం :** పంచగవ్య అభిషేకం, బిల్వదళ అర్చన, మారేడు పండ్లు నివేదన.

**ఫలం :** సర్వకార్యసిద్ధి, సర్వసుఖలబ్ధి. దీనిని నేను అనేకసార్లు విజయవంతంగా ప్రయోగించి చూచాను.

## 18. రోగనివారణ పాశుపతం :

**"ఓం జూం సః సః జూం ఓం గణపతయే వరవరద ఓం జూం సః సర్వరోగాన్ హరహర సః జూం ఓం స్వాహా."**

**విధానం :** దూర్వాజల అభిషేకం, (నీటిలో గరికవేస్తే అది దూర్వాజలం అవుతుంది.) గణేశ అష్టోత్తర పత్రపూజ, లడ్డూ నివేదన.

**ఫలం :** సర్వ అనారోగ్య నివారణ. శ్వేతార్క గణపతికి అభిషేకించిన జలం (బజార్లో దొరికేవి ప్రామాణిక శ్వేతార్క గణపతులు కావు) త్రాగటంవల్ల అనారోగ్యాలు దూరమవుతాయి.

## 19. ఋణవిమోచన పాశుపతం :

"అనృణా అస్మిన్ననృణాః పరస్మిగ్గ్స్తృతీయే లోకే అనృణాశ్యామ ।
యే దేవయానా ఉత పితృయాణా సర్వాన్పధో అనృణా అక్షియేమ॥"

**విధానం :** చెరుకురసంతో అభిషేకం, వాకుడు పూలతోపూజ, ఆవునెయ్యి నైవేద్యం.

**ఫలం :** ఋణవిమోచన. ఒకరోజు అన్నం తినకపోయినా ఫరవాలేదు, ఆనందంగా ఉపవాసమైనా ఉండవచ్చుగానీ అప్పుల వారు ఇంటిగడప తొక్కకపోతేచాలు అనుకునేవారు ఈలోకంలో చాలామంది ఉన్నారు. కానీ ఇలా అనుకుంటూ కూడా తప్పని పరిస్థితిలో అప్పుచేయడం దానివడ్డీ పాపంలాగా పెరిగిపోతూ ఉంటే తీర్చలేక అవస్థపడటం కూడా జరుగుతూ ఉంటుంది. ఆ అప్పు తీర్చడానికి మళ్ళీ అప్పు.... ఇక దీనికి అంతమేది ? ఈ సమస్యలను ఇక్కడితో ఆపడానికే ఈ పాశుపత ప్రయోగం. మరి సామాజికంగా అప్పులేనివారు దీనిని ప్రయోగిస్తే ఏమౌతుంది ? అప్పుడు వారికి ఈ లోకంలో ఉండే ఋణం తీరిపోయి ముక్తి పొందుతారు. మనిషికి అన్ని బాధల కన్నా ఋణబాధ మిన్న. అది యీ మంత్ర జపమూలమున తొలగును.

## 20. సుబ్రహ్మణ్య పాశుపతం :

"ఓం శ్రీం హ్రీం క్లీం సౌః శరవణ భవ వభణవరశ, సౌః క్లీం హ్రీం శ్రీం ఓం"

**విధానం :** పొడి విభూతితో; అష్టగంధంతో అభిషేకం - సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామ పూజ, 21 దీపాలతో అలంకరణ, కుంకుమపూవు, జాజికాయ, జాపత్రి, గోరోచనం, జీడిపప్పు, కిస్మిస్, యాలకులతో చేసిన లడ్డూ నివేదన.

**ఫలం :** కుజదోష నివారణ. లగ్నంలో కుజుడు ఉంటే చతుర్థాన్ని, సప్తమాన్ని, అష్టమాన్ని, వీక్షిస్తాడు. అందువల్ల తరచు ఆక్సిడెంట్లు అవుతూ ఉండటం, ఆరోగ్యం బాగుండకపోవడం వివాహం ఆలస్యమవడం జరగవచ్చు. చతుర్థంలో కుజుడుంటే కూడా వాహన ప్రమాదాలు అవుతూ ఉండటం, వివాహం ఆలస్యమవడం, చేసే ఉద్యోగంలో సమస్యలు రావడం జరగవచ్చు. ద్వితీయంలో లేక పంచమంలో కుజుడుంటే సంతానం కలగకపోవచ్చు. ఇలా కుజదోషాలు అనేక రకాలు ఉంటాయి. ఈ దోషాలలో ఏది ఉన్నా మంగళగ్రహ అధిష్ఠానదేవత అయిన సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అనుగ్రహంతో ఈ దోషం నుండి బైటికిరావచ్చు. అందుకే ఈ సుబ్రహ్మణ్య

పాశుపత ప్రయోగం. ఏరకమగు కుజదోషమైనా దీనిజపము వలన సంతానము కలుగును.

**21. సౌర పాశుపతం :**

**"ఓం హ్రీం ఘృణి సూర్య ఆదిత్యః శ్రీం"**

**విధానం :** తేనె, నెయ్యి, ద్రాక్షరసంతో అభిషేకం 108 లేదా 12 తామరపూలతో అర్చన, మండలం రోజుల తరువాత ఆవునెయ్యి, పటికబెల్లం, చెరుకుముక్కలు, తేనెతో 5,200 సార్లు పై మంత్రంతో ఆహుతులు ఇవ్వాలి.

**ఫలం :** అన్ని నేత్రదోషాలు, అంధత్వం తొలగిపోతుంది. ముఖ్యముగా యీ మంత్ర జపము నేత్రారోగ్యము నిచ్చును.

**22. శ్రీ సౌభాగ్య విద్యేశ్వరీ పాశుపతం :**

**"ఆం హ్రీం క్రోం ఏహి పరమేశ్వరీ స్వాహా"**

**విధానం :** స్ఫటిక మహామేరు శ్రీచక్రానికి పంచామృతాభిషేకం, గౌరీ లేదా త్రిపుర సుందరీ అష్టోత్తరశత కుంకుమార్చన, పచ్చిశనగలు, అరటిపండ్లు, పులిహోర నైవేద్యం - 40 రోజులు తరువాత 12 మంది సువాసినులను పూజించి, వారికి బట్టలు, పసుపు కుంకుమలు, గాజులు, భోజనం పెట్టాలి.

**ఫలం :** సౌభాగ్యవృద్ధి. స్త్రీలకు అన్ని విధాల సౌభాగ్యములను సమకూర్చును.

**23. కార్తికేయ పాశుపతం :**

**"ఓం శ్రీం హ్రీం క్లీం ఐం ఈం ణం స్వాం శరవణభవాయ దేహిమే తనయం స్వాహా."**

**విధానం :** కుజదోషం వల్ల సంతానం కలగనివారు, ఆవుపాలతో బంగారు పడగను అభిషేకించి, ఏడురకాల ఆహారపదార్థాలు నైవేద్యం పెట్టి కనీసం ఏడుగురికి భోజనం పెట్టాలి.

**ఫలం :** సంతాన ప్రాప్తి. ఎక్కువగా కుజ దోషము గలవారికీ సంతానము కలగదు. ఈ మంత్ర జపము కుజదోషాన్ని పోగొట్టి తప్పక సంతానాన్ని కలుగజేయును.

## సర్వాంగ రోగ నివారణ పాశుపతాలు

**24. శిరోపాశు పతం :**

**"అక్షిభ్యాం తే నాసికాభ్యాం కర్ణాభ్యాం చుబుకా దధి ।
యక్ష్మం శీర్ష్యం మస్తిష్కా జ్జిహ్వాయా వివృహామి తే ॥"**

విధానం : మూలికారసాల అభిషేకం, కొబ్బరికాయ నైవేద్యం మారేడు దళపూజ.

ఫలం : కండ్లు, ముక్కు, చెవులు, చిబుకం, తల, మెదడు, నాలుకకు సంబంధించిన అనారోగ్యాలు గాయాలు ఏమి ఉన్నా ఈ పాశుతపతం నివారిస్తుంది. ఈ మంత్ర జపము తలకు సంబంధించిన సర్వరోగాలను హరింపచేసి ఆరోగ్యమిచ్చును.

### 25. కంఠహస్త పాశుపతం :

"గ్రీవాభ్యస్తు ఉష్ణిహాభ్యః కీకసాభ్యో అనూక్యాత్ ।
యక్ష్మం దోషణ్య ఆమం సాభ్యాం బాహుభ్యాం వివృహామితే॥"

విధానం : పై విధంగానే.

ఫలం : గొంతు, తల, ఎముకలు, కీళ్లు, భుజాలు, చేతులు, ముంజేతులు గాయాలు, అనారోగ్యాలు తొలగించడానికి ఈ పాశుపతం...

### 26. హృదయ పాశుపతం :

"ఆన్త్రేభ్యస్తే గుదాభ్యో వనిష్ఠో హృదయాదధి ।
యక్ష్మ మతస్నాభ్యాం యక్నః ప్లాశిభ్యో వివృహామితే ॥

విధానం : పై విధంగానే

ఫలం : ప్రేవులు, మలద్వారం, పొత్తికడుపు, హృదయం, మూత్రపిండాలు, అండాలు, కడుపులోపలి భాగాల (లివర్, పాంక్రియాస్ మొ॥) అనారోగ్యాలు తొలగడానికి ఈ పాశుపతం.... పొట్టకు సంబంధించిన రోగాలు ఈ మంత్రము వలన నశించును.

### 27. పాద పాశుపతం :

"ఊరుభ్యాంతే అష్టివద్భ్యాం పార్ష్ణిభ్యాం ప్రపదాభ్యామ్ ।
యక్ష్మం శ్రోణిభ్యాం భాసదాద్భ్రంససో వివృహామితే ॥"

విధానం : పై విధంగానే

ఫలం : తొడలు, కీళ్లు, మోకాళ్లు, అరికాళ్లు, నడుము యొక్క వెనుక, లోపలిభాగాల గాయాలు, అనారోగ్యాలు తొలగడానికి ఈ పాశుపతం. మోకాళ్లుకు తొడల భాగాలకు గల సర్వరోగహారిణి యీ మంత్రము.

### 28. రోమ పాశుపతం :

"మేహనాద్వనంకరణా ల్లోమభ్యస్తే నఖేభ్యః ।
యక్ష్మం సర్వస్మాదాత్మ నస్తమిదం వివృహామితే॥"

విధానం : పై విధంగానే

ఫలం : జననేంద్రియం (అన్ని V.D.R.L.'S), (మూత్రకోశం, మూత్ర పిండాలలో రాళ్లు, Functional disorders etc), వెంద్రుకలు (జుట్టురాలడం, తెల్లబడటం) గోళ్లు (పుచ్చిపోవడం) మొ॥ గాయాలు, అనారోగ్యాలు తొలగడానకి ఈ పాశుపతం. ఈ పాశుపత మంత్రము పాశుపతాస్త్రమువలె మూత్రపిండవ్యాధులను తొలగించును.

## 29. సర్వాంగ పాశుపతం :

"అఙ్గాదఙ్గాల్లోమ్నో లోమ్నో జాతం పర్వణి పర్వణి ।
యక్ష్మం సర్వస్మాదాత్మనస్తమిదం వివృహామితే॥"

విధానం : పై విధంగానే

ఫలం : ప్రతి అంగం - వెంద్రుకనుండి, వ్యాధి ప్రవేశించే వేలు నుండి, అన్ని అవయవాలు నుండి వ్యాధిని పారద్రోలే పాశుపతమిది.

## 30. వ్యవసాయ పాశుపతం :

"యత్ తే భూమే విఖనామి క్షిప్రం తదపి రోహతు ।
మా తే మర్మ విమృగ్వరి మా తే హృదయమర్పిపమ్ ॥"

విధానం : వ్యవసాయపు భూములలో 108 కడవల జలంతో అభిషేకించాలి. పండించ దలచిన ధాన్యంతో అర్చన, అదే ధాన్యంతో వండిన వంట నివేదన.

ఫలం : వ్యవసాయంలో అధిక దిగుబడులు.

## 31. అగ్ని పాశుపతం :

"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ ।
హోతారం రత్నధాతమమ్"

విధానం : మేకపాలతో అభిషేకం, మేకపాలతో వండిన పాయసం నైవేద్యం, ఎఱ్ఱని పూలతో అర్చన.

ఫలం : రత్న సంచయం జరుగుతుంది. ఈ మంత్రము సర్వ వ్యసనాల్ల నుండి దూరము గావిస్తుంది.

## 32. శుద్ధి పాశుపతం :

"అత్యశనా దతిపానా ద్యచ్చ ఉగ్రాత్ ప్రతిగ్రహాత్ ।
తన్నో వరుణో రాజా పాణినా హ్యవమర్శతు"

విధానం : మూలికారసాల అభిషేకం - పనసపండు నివేదన - తెల్లజిల్లేడు పూలతో అర్చన.

ఫలం : త్రాగుడు మొ॥ దుర్వ్యసనాల నుండి ముక్తి. దానాలు పట్టడం వల్ల వచ్చే దోషాలు నుండి విముక్తి. (ధానాలు పట్టే వారు రోజూ ఈ పాశుపతం చేయాలి.)

### 33. త్రికరణ శుద్ధి పాశుపతం :

"యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతమ్ కృతమ్ ।
తన్న ఇంద్రో వరుణో బృహస్పతి స్సవితా చ పునన్తు పునః పునః॥

విధానం : దానిమ్మ, ద్రాక్ష, కమలాపండ్ల రసాలతో అభిషేకం, ఇప్పపూలతో అర్చన, జాజికాయ, జాపత్రి, కుంకుమపూవు, ఏలక్కాయ, జీడిపప్పు మొదలైనవి వేసిన పాయస నైవేద్యం.

ఫలం : పాప విమోచనం. (ప్రతి సాధకుడు ఈ పాశుపతాన్ని ప్రతిరోజూ అనుష్ఠించాలి. ఈ భూమిమీద జన్మకు కారణం పాపమే, తెలిసిగానీ, తెలియకగానీ, మనమంతా ప్రతిక్షణం పాపం చేస్తూనేఉన్నాము.)

### 34. కుటుంబ పాశుపతం :

"సహనావవతు। సహనౌభునక్తు। సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై॥

విధానం : దానిమ్మరసంతో అభిషేకం, అనాసపండు నైవేద్యం లింగమల్లె పూలతో అర్చన.

ఫలం : కుటుంబాలు, సంస్థలలోని వ్యక్తుల సఖ్యత. కుటుంబాలు, సమాజంలో శాంతి సౌభాగ్యాలు నిలిచి ఉండాలంటే ప్రతివ్యక్తి ఈ పాశుపతాన్ని నిత్యం అనుష్ఠించాలి.

### 35. శివ సూర్య పాశుపతం :

"ఉతైనం గోపా అదృశ న్నుదహార్యః
ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతి నః"

విధానం : మూలికారసాలు, కొబ్బరినీళ్ళతో అభిషేకం, కమలపుష్పాలతో అర్చన, గోక్షీరాన్న నివేదన.

ఫలం : సర్వనేత్రారోగ నిర్మూలన, దివ్యదృష్టి, సాక్షిత్వ ప్రాప్తి. సర్వేంద్రి యాణాం నయనం ప్రధానం. మన చూపులో పవిత్రత సిద్ధంచాలంటే ఈ పాశుపతం అనుష్ఠించాలి.

### 36. కష్టనివారణ పాశుపతం :

"ప్రముంచ ధన్వనస్తముభయోరార్త్ని యోర్జ్యాం ।
యాశ్చతే హస్త ఇషవః పరాతా భగవోవప॥"

విధానం : పంచగవ్యాలతో అభిషేకం, గుమ్మడికాయ నివేదన, తంగేడు, గునుగు పూలతో అర్చన.

ఫలం : కష్టనివారణ. మన కష్టాల పట్టిక చాలా పెద్దది. ఈరోజు ఈ పాశుపతం అనుష్ఠించండి. కనీసం ఈ రోజు కన్నా కష్టాలు ఉండవు.

### 37. వాహన పాశుపతం :

"అశ్వక్రాన్తే రథక్రాన్తే విష్ణుక్రాన్తే వసుంధరా ।
శిరసా ధారయిష్యామి రక్షస్వ మాం పదేపదే
ఓం నమో భగవతే రుద్రాయ, నమో రథేభ్యః రథపతిశ్చవో నమః"

విధానం : పంచామృతాభిషేకం, నిమ్మకాయల నివేదన, బిల్వార్చన

ఫలం : వాహన (కారు,స్కూటరు మొ॥) ప్రాప్తి.

### 38. దత్త పాశుపతం :

"ఓం ద్రాం నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చవో నమః"

విధానం : అన్నాభిషేకం, గురుచరిత్ర పారాయణం, దత్త అష్టోత్తర పూజ, పులిహోర నివేదన, నాలుగు కుక్కలకు అభిషేకాన్నం తినిపించడం.

ఫలం : దత్త దర్శనం.

### 39. వామన పాశుపతం :

"నమో హ్రస్వాయచ వామనాయచ, యో అస్కభాయదుత్తరగ్ం
సధస్థం విచిక్రమాణస్త్రేఉ_థోరగాయః"

విధానం : మండల అర్చన తరువాత బ్రాహ్మణ వటువును అర్చించి, దండం, యజ్ఞోపవీతం, గొడుగు, పాదుకలు, కమండలం దానంచేసి దక్షిణ సహిత భోజనం చేయించాలి.

ఫలం : వామనావతార దర్శనం

### 40. వేగపాశుపతం :

"ఓం నమో భగవతే రుద్రాయ స్రోతస్యాయ చ.
శీఘ్రియాయ నమః "

విధానం : నడుములోతు నీటి ప్రవాహంలో నిలుచుని పై మంత్రాన్ని రుద్ర సంపుటీకంలో జపించాలి.

**ఫలం :** జీవితంలో ఏ పని, లేదా ఏ సాధన అయినా లేక అనారోగ్యమైనా వేగంగా అనుకూలం కాకపోతే, దీనితో శీఘ్రంగా పూర్తిచేయవచ్చు.

**41. సంగీత పాశుపతం :**

**"ఓంనమోభగవతే రుద్రాయ శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ**
**నమో భగవతి వీం వీణాయై మమ సంగీత విద్యాం ప్రయచ్ఛ స్వాహా"**

**విధానం :** పై మంత్రపు సంపుటీక రుద్రాభిషేక అర్చనలు చేసి, "గీతం శ్రావయామి" అనే ఉపచార సమయంలో రుద్ర నమస్కార మంత్రం, సరస్వతీ మంత్రం ఘనపాఠాలు పారాయణం చేయాలి.

**ఫలం :** సంగీత విద్యలో ప్రావీణ్యత. ఈ మంత్ర జపము వలన సంగీత శాస్త్ర విద్యలో గొప్ప ప్రావీణ్యము సంపాదించిన వారగుదురు.

**42. కీర్తి పాశుపతం :**

**"ఓం నమోభగవతే రుద్రాయ శ్రుతాయచ శ్రుత సేనాయచ"**

**విధానం :** అష్టగంధ జలంతో అభిషేకం, సుగంధ పుష్పాలతో అర్చన, బాగా మగ్గిన పండ్ల నైవేద్యం.

**ఫలం :** పేరు ప్రఖ్యాతులు, కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి.

**43. జలపాశుపతం :**

**"ఓం నమోభగవతే రుద్రాయ, కూప్యాయచ నమః "**

**విధానం :** గంగాజలంతో అభిషేకం, జువ్విపూలతో అర్చన, బత్తాయి లేదా కమలాఫలాల నివేదన, పై (Y) ఆకారంలో ఉన్న జువ్వి కొమ్మను శివలింగంపై ఉంచి అర్చించాలి.

**ఫలం :** పై రెండు కాడలను రెండు చేతులతో పట్టుకొని ముందుకు సాగితే, భూగర్భంలో జలం ఉన్నచోట ఈ మిగిలిన క్రింది భాగం క్రిందికి వంగుతుంది. అక్కడ బావి (నుయ్యి) త్రవ్వుకుంటే నీరు లభిస్తుంది.

**44. వాయు పాశుపతం :**

**"ఓం నమో భగవతే రుద్రాయ వాత్యాయ, ఆవాయవ్యయా వాయవ్యా। ఆయవాయవ్యా వాయవ్యా। ఆవోర్వాయయా వాయువ్యోం యం హుం ఫట్"**

**విధానం :** పవమాన సూక్తంతో అభిమంత్రించిన జలంతో అభిషేకం చేసి, సుగంధ పుష్పాలతో అర్చించి, రేగుపండ్లు నివేదన చేయాలి.

**ఫలం :** వాయు శూల( Gastro Enteritis కు సంబంధించిన జబ్బులు),ఆస్తమా మొ॥ శ్వాసరోగాలు నయమయి, జీవిసంస్కారాలు పవిత్రమౌతాయి. దీని వలన ఉబ్బస రోగాలు నయమగును.

## 45. వాస్తు పాశుపతం :

"ఓం నమో భగవతే రుద్రాయ వాస్తవ్యాయచ వాస్తుపాయచ"

**విధానం :** బ్రహ్మయంత్రం, మత్స్యయంత్రం, కూర్మయంత్రం, అష్టదిగ్బంధన, వాస్తుపురుష యంత్రాలు తీసుకొని, పంచగవ్యాలతో శుద్ధిచేసి ప్రాణ ప్రతిష్ఠచేసి మండలం రోజులు పై మంత్రం రుద్ర సంపుటీకంలో అభిషేకించి, మండలం రోజులు అర్చించి, ఈశాన్యంలో చిన్నగుంట త్రవ్వి కూర్మయంత్రాన్ని ఉంచాలి. ఈ శాన్యం గోడకు మత్స్యయంత్రాన్ని ఉంచాలి. బీరువాలో ధనం ఉంచేచోట అష్టదిక్‌బంధన యంత్రం ఉంచాలి, పూజాస్థానంలో బ్రహ్మయంత్రం, ఇంటికి దాదాపు మధ్యలో ఏదైనా గోడకు వాస్తు పురుషయంత్రం తగిలించాలి.

**ఫలం :** సమస్త వాస్తుదోష నివారణ. గృహమున ఎలాంటి వాస్తు దోషమున్నా యీ మంత్రము ఆ దోషాలన్నీ తొలగించును.

## 46. కాలబైరవ పాశుపతం :

"ఓం హం షం నం గం ఫం సం ఖం మహాకాలభైరవాయ ఏషాం పురుషాణా మేషాం పశూనాం మాభేర్మా ఉ రోమో ఏషాం కించనా మమత్ నమః"

**విధానం :** మేకపాలతో అభిషేకం, గొంగళి ఆసనం, మేకపాలతో చేసిన పాయసం నైవేద్యం, గడ్డిపూలతో అర్చన.

**ఫలం :** కాలభైరవ దర్శనం, పశు సంపదవృద్ధి, పశువుల రోగ నివారణ.

## 47. ఆరోగ్య పాశుపతం :

"ఓం నమో భగవతే రుద్రాయ, యా తే రుద్ర శివా తనూశ్శివా విశ్వాహ భేషజీ । శివా రుద్రస్య భేషజీ తయానో మృడ జీవసే, దేహి సౌభాగ్యమారోగ్యం దేహిమే పరమం సుఖం నమః"

**విధానం :** మూలికారసాయనాలతో అభిషేకం, గులాబీ పూలతో అర్చన, మధురఫల నైవేద్యం.

**ఫలం :** ఆరోగ్య సౌఖ్యవృద్ధి. ఇది అనారోగ్యాలనన్నిటినీ తొలగించును.

## 48. ఉగ్రనరసింహపాశుపతం :

"ఓం శ్రీం క్ష్రౌం శ్రీం ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖం, నృసింహం భీషణం భద్రం మృగన్న భీమముపహత్నుముగ్రమ్, మృత్యు మృత్యుం నమామ్యహం"

**విధానం :** బెల్లం పానకంతో అభిషేకం, వడపప్పు పానకం నైవేద్యం, తులసీ పత్రాలతో అర్చన.

ఫలం : నృసింహ దర్శనం (సాక్షాత్కారం)

**49. నిత్యశివ దర్శన పాశుపతం :**

**"ఓం నమో భగవతే రుద్రాయ, పరమే వృక్ష ఆయుధన్నిధాయ కృత్తిం వసాన ఆచర పినాకం బిభ్రదాగహి"**

**విధానం :** అన్నాభిషేకం. నువ్వులనూనె, కొబ్బరినూనె, వేరుశనగనూనె, ఆవనూనెలతో ఐదు దీపాలు దీపారాధన, తెల్లని, ఎఱ్ఱని, పచ్చని, నల్లని (నీలి) గులాబి రంగు పూలతో అర్చన; అరటి, మామిడి, జామ మొ॥ ఐదురకాల పండ్లు నైవేద్యం.

**ఫలం :** నిత్యం ఏదో ఒక రూపంలో శివుడు వెంట నడుస్తాడు.

**50. సువర్ణ పాశుపతం :**

**"ఓం నమోభగవతే రుద్రాయ, వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః, ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథబిల్వః। తస్య ఫలాని తపసానుదంతు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః "**

**విధానం :** మారేడు చెట్టుకింద ఆవుపేడతో అలికి, గోమూత్రంతో అభిషేకించి, మారేడు దళాలతో లక్ష్మీ-శివ అష్టోత్తరాలతో అర్చించి, మారేడు పండ్లతో చేసిన హల్వా నైవేద్యం పెట్టాలి.

**ఫలం :** సువర్ణప్రాప్తి. ఇది బంగారమును లభింపచేయు మహామంత్రము.

**51. అన్న పాశుపతం :**

**"ఓం రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽన్తరిక్షే యేదివి యేషా మన్నం వాతో వర్షమిషవస్తేభ్యో నమః దేవస్యత్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్। సరస్వత్యై భైషజ్యేన । వీర్యాయాన్నాద్యా యాభిషిఞ్చామి॥"**

**విధానం :** ఏడుసముద్రాలు లేదా ఏడు నదులలోని జలాలతో అభిషేకించి అన్నంతో అర్చించి,రోజూ అన్న నివేదన చేయాలి. మండలం తరువాత శక్తికొద్ది అన్నదానం చేయాలి.

**ఫలం :** ఎన్ని లక్షలమందికైనా అన్నదానం చేయగల సామర్థ్యం లభిస్తుంది.

**52. ఆయుః పాశుపతం :**

**"శతమన్యు శరదో అంతి దేవాయత్రానశ్చక్రా జరసం తనూనామ్। పుత్రాసో యత్ర పితరో భవంతి మానో మధ్యరీరిషతాయుర్గంతోః॥"**

**విధానం :** విభూతితో అభిషేకం, ఆవునెయ్యి అభిషేకం, రక్తపుష్పాలతో పూజ.

**ఫలం :** సుదీర్ఘ ఆయువు ప్రాప్తి.

## 53. మృత్యు నివారణ పాశుపతం :

"యేతే సహస్రమయుతం పాశామృత్యో మర్త్యాయ హంతవే తాన్ యజ్ఞస్య మాయయా సర్వానవ యజా మహే! మృత్యవేస్వాహా, మృత్యవేస్వాహా! ఓం నమో భగవతే రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి॥"

విధానం : పై విధంగానే

ఫలం : మృత్యునివారణ

## 54. శుభకామనా పాశుపతం :

"ఆనో భద్రాః క్రతవో యంతు విశ్వతోఽదబ్ధాసో అపరీతాస ఉద్భిదః దేవానో యథా సదమిద్ వృధే అసన్న ప్రాయువో రక్షితారో దివేదివే ॥

విధానం : రోజూ ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం. భౌతికమైన వస్తువులేవీ అవసరంలేదు.

ఫలం : వ్యక్తి మాటకు విలువ పెరుగుతుంది, అంతా ఆదరిస్తారు. తన ఆలోచనా విధానం కూడా మారుతుంది.

## 55. నిత్యావసర పాశుపతం :

"తన్నోవాతో మయోభువాతు భేషజం తన్మాతా పృథివీ తత్ పితా ద్యౌః తద్ గ్రావాణః సోమసుతో మయోభువస్తవశ్వినా శృణుతం ధిష్ణ్యాయువమ్॥

విధానం : గోక్షీరాభిషేకం మరకత లింగంపైన, జిలేబీనివేదన, బాగా వికసించిన సుగంధ పుష్ప అర్చన.

ఫలం : నిత్యావసరాలైన ఆనందం, ఔషధం, ధనం, వీటిని సరిగ్గా ఉపయోగించగల బుద్ధి వికాసం లభిస్తాయి.

## 56. అగ్నిశమన పాశుపతం :

"తమీశానం జగతస్త స్థుషస్పతిం ధియం జిన్వమనసే హూమహే వయమ్। పూషా నో యథా వేదసామసద్ వృదే రక్షితా పాయురదబ్ధః స్వస్తయే"

విధానం : జలాభిషేకం, స్ఫటిక లింగంపై, తెల్లని పూలతో పూజ, గోక్షీర నివేదన.

ఫలం : అగ్నితత్వపు రాశులైన మేషసింహ,ధనస్ అధిపతులు కుజుడు, రవి, గురువులు లగ్నానికి రెండువైపుల (ద్వాదశ, ద్వితీయాలలో) వచ్చినపుడు, జీవికి అగ్ని ప్రమాదం జరిగే ప్రమాదం ఉంది. దాని నివారణకులేదా జీవితంలో కష్టాలు కాలాగ్ని లాగా దహిస్తున్నపుడు ఈ పాశుపతాన్ని వాడాలి.

## 57. దాంపత్య పాశుపతం :

"జాయాపత్యే మధుమతీం వాచం వదతు శాన్తిదమ్"

**విధానం :** రోజూ ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం, శక్తికొద్దీ దంపతులకు అన్నవస్త్రదానం (మండలం తరువాత) భౌతిక పూజాద్రవ్యాలు అవసరంలేదు.

**ఫలం :** సుఖవంతమైన దాంపత్య జీవితం

## 58. తనయ పాశుపతం :

**"అనువ్రతః పిత్రుః పుత్రో మాత్రా భవతు సన్మనాః ।"**

**విధానం :** ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం. 40 రోజుల తరువాత పేదవిద్యార్థులకు భోజనం, స్కూలుఫీజులు దానం చేయడం, భౌతిక పూజాద్రవ్యాలు అవసరంలేదు.

**ఫలం :** మాట వినని పిల్లలు దారికి వస్తారు.

## 59. సోదర సోదరీ పాశుపతం :

**"మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసారముత స్వసా।**
**సమ్యఞ్చః సవ్రతా భూత్వా వాచం వదతు భద్రయా॥"**

**విధానం :** ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం, 40 రోజుల తరువాత బీదపిల్లలకు అన్నవస్త్రదానం.

**ఫలం :** అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, అన్నాచెల్లెళ్లు, అక్కాతమ్ముళ్ల మధ్య సఖ్యత. దీని వలన గొప్పగా కుటుంబ సఖ్యత యేర్పడును.

## 60. సమాజ పాశుపతం :

**"సమానీ ప్రవాసహవోఽన్న భాగః సమానే యోక్త్రే సహవోయునజ్మి ।**
**సమ్యఞ్చోఽగ్నిం సపర్యతారా నాభిమివాభితః "**

**విధానం :** ఏకాదశ రుద్రాలతో గ్రామ శివాలయంలో నిత్యాభిషేకం, 40 రోజుల తరువాత గ్రామంలో వారంతా కలిసి భగవంతుడికి నివేదించిన అన్నాన్ని సహపంక్తి భోజనం చేయాలి.

**ఫలం :** నవసమాజ నిర్మాణం – స్పర్ధరహితమైన సమాజ సహజీవనం.

## 61. సామరస్య పాశుపతం :

**"సమానీవ ఆకూతిః సమానా హృదాయాని వః ।**
**సమాన మస్తు వో మనో యథా వః సు సహాసతీ॥"**

**విధానం :** ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం, 40 రోజుల తరువాత అంతా కలిసి నివేదిత ప్రసాదాన్ని స్వీకరించడం.

**ఫలం :** ఏక సంకల్పాలు, ఏకభావాలు, ఏకచింతన, సామరస్యత సిద్ధిస్తాయి.

62. **కాల పాశుపతం :**

"పూర్ణ కుంభోఽధి కాల ఆహితస్తం వై పశ్యామో బహుధానుసన్తమ్।"

**విధానం :** రోజూ ఏకాదశ రుద్రాలతో సంపుటీక పారాయణం. 40 రోజుల తరువాత ఆలయంలో అభిషేక అర్చనలు, కూష్మాండం (గుమ్మడికాయ) బలి.

**ఫలితం :** కాలస్వరూపం అవగతమై, మృత్యుభయం తొలగి, కర్తవ్య పాలనలోనూ నిత్యసాధనలోనూ మునిగిపోవడం.

63. **దుస్స్వప్న నాశక పాశుపతం :**

"సహస్ర పరమాదేవీ శతమూలా శతాంకురా।
సర్వగ్ం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్ననాశినీ॥"

**విధానం :** దూర్వా జలాభిషేకం, దూర్వలతో అర్చన, పెరుగన్నం నివేదన.

**ఫలం :** దుస్స్వప్నాలు దూరమౌతాయి.

64. **ఇష్టికా పాశుపతం :**

"యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి।
తస్యాస్తే దేవీష్టకే విధేమహ విషా వయమ్॥"

**విధానం :** నిత్య సంపుటీక పారాయణ, మండలం తరువాత హవనం, ఆవునేతితో ఆహుతులు

**ఫలం :** ఇచ్ఛాప్రాప్తి, దీర్ఘాయువు.

65. **భూ పాశుపతం :**

"భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ।
ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణేన శతబాహునా॥"

**విధానం :** నిత్య సంపుటీక పారాయణ, మృత్తిక లింగార్చన, మట్టి కుండలో వండిన అన్నం నివేదన.

**ఫలం :** సమస్త కామితార్థాలు తీరుతాయి. దీని వలన సమస్త కోరికలూ తప్పక సిద్ధించును.

66. **పుష్టి పాశుపతం :**

"మృత్తికే బ్రహ్మదత్తాఽసి కాశ్యపేనాభిమన్త్రితా।
మృత్తికే దేహిమే పుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్॥"

**విధానం :** ఆవుపేడ, గోమూత్రం, పుట్టమన్ను కలిపి శరీరానికీ పూసుకుంటూ పారాయణ చేయాలి (బ్రాహ్మీముహూర్తంలో)

**ఫలం :** శారీరక మానసిక పుష్టి.

## 67. మృత్తికా పాశుపతం :

"మృత్తికే హనమే పాపం యన్మయూ దుష్కృతం కృతమ్।
మృత్తికే ప్రతిష్ఠితే సర్వం తన్మే నిర్ణుద మృత్తికే।
తయా హతేన పాపేన గచ్ఛామి పరమాం గతిమ్।"

విధానం : మృత్తిక, ఆవుపేడ, గోమూత్రం కలిపి శివలింగం చేసి, సంపుటీక పారాయణలో గోమూత్ర ప్రోక్షణ అర్చన.

ఫలం : పాప నివృత్తి, ముక్తి.

## 68. పితృ పాశుపతం :

"ఇమం యమప్రస్తర మాహిసీ
దాఙ్గిరోభిః పితృభి స్సంవిదానః॥"

విధానం : అన్నాభిషేకం – ఏకాదశ రుద్రాలతో పిత్రామావాస్య– లేదా పితృ పక్షాలలో రోజూ ఒక రుద్రంతో అభిషేకం చేసి ఆ అన్నాన్ని కాకులకు లేదా చేపలకు లేదా నల్ల ఆవుకు తినిపించాలి.

ఫలం : పితృదోష నివారణ

## 69. హుతాశన పాశుపతం :

"యాతే అగ్నే రుద్రియా తనూస్తయం నః పాహి తస్యాస్తే స్వాహా॥"

విధానం : ఆవు నెయ్యితో అభిషేకం – నేతితో చేసిన మధుర పదార్థాల నివేదన.

ఫలం : కష్టాలు, దుఃఖాలు అంతమౌతాయి.

## 70. ధన పాశుపతం :

"అగ్నేనయ సుపథా రాయే అస్మాన్।
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మజ్జు హురాణమేనో
భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ॥"

విధానం : ఆవు నేతితో అభిషేకం – నేతితో చేసిన మధుర పదార్థాల నివేదన.

ఫలం : ధర్మ మార్గంలో ధనప్రాప్తి. సత్య ధర్మములతో అధిక సంపదలు దీని వలన కలుగును.

## 71. దుందుభీ పాశుపతం :

"ఉపశ్వాసయ పృథివీముతద్యాం।
పురుత్రాతే మనుతాం విష్ఠితం జగత్।
స దుందుభే సజూ రింద్రేణ దేవై
ర్దూరాద్దవీయో అపసేధ శత్రూన్॥"

విధానం : ఆవుపాలు, పెరుగుతో అభిషేకం, ఆవుపాలతో చేసిన నైవేద్యం.

ఫలం : మనశ్శాంతి, సమాజశాంతి, ధనప్రాప్తి.

కర్తవ్యం : ఈ సాధనలో సిద్ధిని పొందినవారు, 52 భైరవులలో ఎవరికైనా మందిరం నిర్మించి అక్కడ 24 గంటలు దుందుభీనాదం వినడే ఏర్పాట్లు చేయాలి.

**72. కామనా పాశుపతం :**

**"మహీద్యౌః పృథివీచన - ఇమా యజ్ఞం మిమేకతామ్**
**పిపృతానోభరీమభిః ॥"**

విధానం : మృత్తిక లింగాన్ని, జలంతో ప్రోక్షించడం, కొబ్బరి బెల్లంతో చేసిన పదార్థం నైవేద్యం.

ఫలం : కోరికలు తీరుతాయి.

## శ్రీ శివ పాశుపతాలు

**73. ప్రాజాపత్య పంచాక్షరి :**

**"షేం శివాయ నమః"**

విధానం : శివాలయంలో లేదా పూజాస్థలంలో శివలింగం ఎదురుగా కూర్చుని పై మంత్రం సంపుటీకంలో పదకొండుసార్లు రోజూ రుద్ర పారాయణం నలభై రోజులు చేయాలి. నలభై ఒకటవ రోజు పండ్ల రసాలు, కొబ్బరినీళ్ళతో అభిషేకించాలి.

ఫలం : దైవ దర్శనం.

**74. సంతాన పంచాక్షరి :**

**"దేహే ఓం శిం శివాయోన్నమః"**

విధానం : నలభై రోజులు గోమూత్రంతో ఈ మంత్ర సంపుటీక రుద్రాన్ని అభిషేకించాలి.

ఫలం : సంతాన ప్రాప్తి. మంచి సంతానము కలుగును.

**75. నేత్ర పంచాక్షరి :**

**"తనుం శివాయోన్నమః"**

విధానం-ఫలం : స్పటిక శివలింగంపై పై మంత్ర సంపుటీక రుద్రాన్ని సూర్య కాంతపుష్పనూనె (Sun Flower Oil) తో ఇరవై ఏడు రోజులు అభిషేకించి దానిని వంటలో వాడుకోడం వల్ల నేత్ర రుగ్మతలు తగ్గి దృష్టి బాగవుతుంది. నేత్ర రోగాలన్నీ మాయమగును.

**76. విష్ణు పంచాక్షరి :**

"వశీచ్ఛివాయోం"

**విధానం-ఫలం :** నలభై రోజులు ఆవుపాలతో సాలగ్రామాన్ని రుద్ర సంపుటీకంతో అభిషేకిస్తే మోక్షప్రాప్తి కలుగుతుంది.

**77. దిగ్గజ పంచాక్షరి :**

"లోకాయ శివాయ హ్రీం నమః"

**విధానం-ఫలం :** ఇరవై ఏడు రోజులు పంచగవ్యాలు (గోమూత్రం, గోమయం, గోక్షీరం, గోఘృతం, గోదధి, తేనె, చక్కెర, కొబ్బరినీరు) వెరసి ఎనిమిదింటితో రుద్ర సంపుటీకంతో అభిషేకిస్తే అన్ని దిక్కుల జయం కలుగుతుంది.

**78. తురగ పంచాక్షరి :**

"త్వం శివాయోం"

**విధానం-ఫలం :** పూర్వ కాలంలో అశ్వవృద్ధి (గుఱ్ఱాల వృద్ధి) కొరకు ఈ ప్రయోగం చేసేవారు. ప్రస్తుత కాలంలో కారు లేదా మోటారుసైకిల్ పొందటం కొరకు ఈ పాశుపతాన్ని ఉపయోగించవచ్చు. 40 రోజులు రుద్ర సంపుటీకంలో పై మంత్రాన్ని జపించడం వల్ల ఫలం లభిస్తుంది.

**79. గంగా పంచాక్షరి :**

"జీవ ఓం శివాయోం"

**విధానం-ఫలం :** 40 రోజులు గంగాజలంతో స్ఫటిక లింగాన్ని అభిషేకిస్తూ పై మంత్రాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేయాలి. ఇష్ట దేవతా దర్శన ఫలం.

**80. అగ్ని పంచాక్షరి :**

"అగ్ని శివాయోం"

**విధానం-ఫలం :** అగ్నితత్త్వ రాశులైన మేషం, సింహం, ధనస్సులలో ఏదైనా లగ్నంగా గానీ రాశిగా గాని గల జాతకులకు, ఆయా రాశ్యాధిపతులైన కుజ, రవి, గురువులలో ఎవరైనా లగ్నంలో ఉన్నప్పుడు, లగ్నానికి ఇరువైపులా గోచారంలో (అంటే ద్వితీయ, వ్యయ స్థానాలలో) ఈ అగ్ని తత్త్వ గ్రహాలు వచ్చినప్పుడు ఒళ్ళు, ఇల్లు కాలడంలాంటి అగ్ని ప్రమాదాలు సంభవిస్తాయి. ఇటువంటివేవీ జరగకుండా ఉండటం కొరకు, ఈ అగ్ని పంచాక్షరిని రుద్ర సంపుటీకంలో 40 రోజులు ఆవుపాలతో అభిషేకిస్తూ ఫలితాలు పొందవచ్చు.

**81. అఘ నివారణ పంచాక్షరి :**

"హ్రీం హ్రీం శివాయ హ్రీం హ్రీం"

విధానం-ఫలం : అఘం అంటే పాపం. 27 రోజులు గోమూత్రంతో పై మంత్ర సంపుటీక రుద్రపారాయణలో పాదరస లింగాన్ని అభిషేకించడం వల్ల సర్వ పాపాలు తొలగి దారిద్ర్యం వదలి, లక్ష్మి ప్రాప్తిస్తుంది. ఈ మంత్ర జపము వలన అఖండమైన లక్ష్మి ప్రాప్తించును.

**82. ఆత్మ పంచాక్షరి :**

"ఈశః హంసశ్శివాయోహం"

**విధానం-ఫలం :** 40 రోజులు ఈ పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో నందికి ఎదురుగా కూర్చుని (శివాలయం గర్భగుడి తలుపులు మూసిన తరువాత) పారాయణం చేస్తే ఆత్మజ్ఞానం కలుగుతుంది.

**83. మేఘ పంచాక్షరి :**

"హాం ఈం ఓం భ్రుం శివాయ నమః"

**విధానం-ఫలం :** శివలింగాన్ని జలాధివాసం చేసి (నీటిలోముంచి) పై పాశుపత సంపుటీకంలో రుద్రపారాయణం చేయాలి. మేఘాలు ఆవరించి కావలసినంత వర్షం పడేవరకు పారాయణలు కొనసాగించాలి. ఈ శివలింగార్చన మంత్ర జపమువల్ల మహావర్షము కురియును.

**84. వాయు పంచాక్షరి :**

"హ్రీం రం శివ శివ ఓం"

**విధానం-ఫలం :** పంచలింగావరణాన్ని నిర్మించి (మధ్యలో ఒక శివలింగం, ఆ శివలింగానికి నాలుగు దిక్కులా నాలుగు శివలింగాలనుంచితే అది పంచలింగావరణ అని పిలువబడుతుంది) పంచగవ్యాలతో 40 రోజులు పై పాశుపత సంపుటిత రుద్రంతో అభిషేకిస్తే ప్రాణపోషణ జరుగుతుంది. వాయురోగాలు శమిస్తాయి (ఉబ్బసం, ఇస్నోఫిలియా మొ॥)

**85. సిద్ధ పంచాక్షరి :**

"యజ్ఞనావాశీమయ"

**విధానం-ఫలం :** ఏదైనా సాధన పూర్తి చేసిన తరువాత ఫలితం రాకపోతే పై పంచాక్షరిని రుద్రసంపుటీకంలో మార్జనం (అభిషేకం) చేసి ఫలితాన్ని పొందవచ్చు.

**86. యజ్ఞ పంచాక్షరి :**

"ఋత్వీ శివాయోం"

**విధానం-ఫలం :** ఏదైనా యజ్ఞం, యాగం, హవనం, హోమం చేసేటప్పుడు పై పాశుపత సంపుటీకంతో రుద్రపారాయణం చేయడం ద్వారా యజ్ఞ ఫలాన్ని సంపూర్ణంగా పొందవచ్చు.

**87. పూజా పంచాక్షరి :**

"హ్రౌం హ్రీం హ్రూం ఓం నమశ్శివాయ నమశ్శివాయ"

**విధానం-ఫలం :** చాలా సంవత్సరాల నుండి ఏ దేవతనైనా ఉపాశిస్తూ పూజిస్తూ ఉన్నవారు, ఒకసారి పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంతో జపిస్తే వెంటనే వారి పూజలకు ఫలితాన్ని లేదా ఇష్ట దైవ దర్శనాన్నే పొందవచ్చు.

**88. సుందర పంచాక్షరి :**

"క్లీం శిం శిం వాం వాం యం యం నమః"

**విధానం-ఫలం :** ఒక ప్రత్యేక వ్యక్తిని వశీకరించుకోవడానికి 40 రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేయవచ్చు. నైవేద్యంగా పెట్టిన పదార్థాన్ని ఆ వ్యక్తికి తినిపించడం వల్ల ఇది సాధ్యం అవుతుంది.

**89. నిర్విష పంచాక్షరి :**

"హ్రూం హ్రీం శివ శివ చరణ సదాశివానందం శివశివ నమోనమ"

**విధానం-ఫలం :** బండి గురిజాకు రసం, ఒక ఆకుకు రెండు మిరియాలు చొప్పున కలిపి ఈ మంత్రం సిద్ధించుకున్నవారు ప్రయోగిస్తే ఎటువంటి పాము విషమైనా దిగిపోతుంది. పై పాశుపతంలో సంపుటీకరించిన రుద్రపారాయణం 27 రోజులు పారాయణం చేసి దీనిని సిద్ధించుకోవచ్చు.

**90. ప్రాణదాయక పంచాక్షరి :**

"హ్రూం హ్రీం శివాయ ఓం నమః స్వాహా"

**విధానం-ఫలం :** 40 రోజులు పై పాశుపత రుద్రసంపుటీకాన్ని, ఒంటరిగా ఉన్న నంది (ఎదురుగా శివలింగం లేని) ఎదురుగా జపించడం లేదా నందిని అభిషేకించడం చేయవచ్చు. ఇలా మృతసంజీవనీ విద్య సిద్ధిస్తుంది. దీనితో అపమృత్యు రోగాలు నివారించవచ్చు, బలవన్మరణం చెంది ఇంకా ఇక్కడే తిరుగుతున్న ఆత్మలకు ముక్తినివ్వవచ్చు. (తమిళనాడులోని తిరుపొంగూరులో ఇది త్వరగా సిద్ధిస్తుంది)

**91. ఖేచర పంచాక్షరి :**

"ఖం ఖం శివాయ నమః"

**విధానం-ఫలం :** శూన్య శివాలయంలో (శివలింగం లేని ఆలయం) లేదా ఏదైనా కొండ శిఖరం మీద కూర్చుని ఈ పాశుపతం సంపుటీకరించిన రుద్రం పారాయణం

చేయడం వల్ల 40 రోజులలో ఆకాశగమన విద్య (గతజన్మ పుణ్యకర్మలు చాలా అవసరం) సిద్ధిస్తుంది. అల్పపుణ్యులు జీవితాంతం ఈ సాధన చేయగా ఏదో ఒక జన్మలో సిద్ధిస్తుంది. (చిదంబరంలో ఈ సిద్ధి సులభం) ఈ అభిషేకముచే ఆకాశమున ఎగరగల శక్తి వచ్చును.

**92. ద్యూత పంచాక్షరి :**

**"ఓం హ హ ఓం నమశ్శివాయ"**

**విధానం-ఫలం :** 27 రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంతో పారాయణం చేయడం వల్ల ద్యూతంలో (Gambling) విజయాన్ని పొందే శక్తి ప్రాప్తిస్తుంది.

**93. విజ్ఞాన పంచాక్షరి :**

**"క్రౌం హం హం శివాయ ఓం నమః"**

**విధానం-ఫలం :** 40 రోజులు రుద్రసంపుటీక పారాయణం చేయగా విజ్ఞాన ప్రాప్తి కలుగుతుంది.

**94. సదాశివ పంచాక్షరి :**

**"మాయాం శోషయ శోషయ - సదాశివాయ నమః"**

**విధానం-ఫలం :** 40 రోజులు రుద్రసంపుటీక పారాయణం చేయగా, మాయ అంతమై యదార్థం గోచరిస్తుంది. ఎటువంటి క్లిష్టమైన విషయాన్నైనా ఇట్టే విశ్లేషించగల సామర్థ్యం సిద్ధిస్తుంది.

**95. విష్ణు పాశుపతం :**

**"రక్ష రక్ష హ్రీం శివాయ స్వాహా"**

**విధానం-ఫలం :** 40 రోజుల రుద్రసంపుటీక పారాయణంలో విష్ణు మాయ అంతమౌతుంది.

**96. పురుహూత పంచాక్షరి :**

**"మం మం మం శివాయ ఓం నమః"**

**విధానం-ఫలం :** 27 రోజుల రుద్ర సంపుటీక పారాయణంలో సభావశ్యం జయం కలుగుతాయి. దీనివలన మహాసభలో గల వారందరూ వశమగుదురు.

**97. విమర్శ పంచాక్షరి :**

**"ప్రేం శివాయ హుం నమః"**

**విధానం-ఫలం :** 40 రోజులు పాదరస లింగాన్ని పచ్చి పాదరసంతో పై మంత్ర రుద్రసంపుటీకంలో అభిషేకిస్తే సకల విద్యాసిద్ధి కలుగుతుంది. దీనివలన సమస్త శాస్త్రవిద్యలు కరతలామలకాలగును.

**98. సర్వ పంచాక్షరి :**

"అం హం నం మం మవాయ నశి"

**విధానం-ఫలం :** 40 రోజులు పై పాశుపత సంపుటీక రుద్రాన్ని జపించడం వల్ల శత్రునాశనం చేయగల ఖడ్గం లభిస్తుంది.

**99. సత్య పంచాక్షరి :**

"ఓం నం శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేస్తే భవిష్యత్తులో జరగబోయే విషయాలు తెలుస్తాయి. దీని మూలాన ముందు జరగబోవు కార్యక్రమాలన్నీ తెలియును.

**100. శరభ పంచాక్షరి :**

"ఓం ఖస్ ఫ్రేం శివాయ నమః ఓం"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్ర సంపుటీకంలో పారాయణం చేస్తే పాతాళగమన శక్తి కలుగుతుంది.

**101. విశ్వ పంచాక్షరి :**

"వం శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్ర సంపుటీకంలో పారాయణం చేస్తే అదృశ్యీకరణ శక్తి కలుగుతుంది. దీనివలన ఎవరికీ కానుపించని కామగమన శక్తివచ్చును.

**102. గరుడ పంచాక్షరి :**

"గం గం ఆ ఆ నమశ్శివాయ"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని సాలగ్రామంపై రుద్ర సంపుటీకంలో పంచగవ్యాలతో అభిషేకిస్తే సర్వ విష నాశక శక్తి లభిస్తుంది. ఆ తరువాత వారు జలం మంత్రించి ఇచ్చినా విషం దిగిపోతుంది. దీనివలన ఎటువంటి సర్పవిషమైనా దిగిపోవును.

**103. భ్రమర పంచాక్షరి :**

"ఓం మావాయ శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని సముద్రజలంతో రుద్ర సంపుటీకంతో అభిషేకిస్తే (జలగర్భ సాలిగ్రామాన్ని) జలస్తంభనం సిద్ధిస్తుంది. నీటిలో నుండే మహాశక్తి దీనివలన ప్రాప్తించును.

## 104. గుణ పంచాక్షరి :

"ఓం హం సోஉ హం నమశ్శివాయ ఓం"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని శివాలయంలో నందికి శివలింగానికి మధ్య కూర్చుని రుద్ర సంపుటీకంలో పారాయణం చేస్తే త్రిగుణాలనూ జయించవచ్చు.

## 105. సంధాన పంచాక్షరి :

"ఓం మ మ మ మ శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేస్తే సాధకుడు తనను తాను జయించగలడు.

## 106. సంహార పంచాక్షరి :

"త్ర్యమ్బ్రం త్ర్యమ్బ్రం ఓం శివ శివ ఓం"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో కుంకుమ నీళ్ళతో అభిషేకిస్తే సంహార శక్తి సిద్ధిస్తుంది.

## 107. వహ్ని పంచాక్షరి :

"రం రం రం శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేస్తే అగ్ని స్తంభనం సిద్ధిస్తుంది.

## 108. సిద్ధి పంచాక్షరి :

"హాం హాం హాం శివాయ నమః"

**విధానం-ఫలం :** మండలం రోజులు పై పాశుపతాన్ని రుద్రసంపుటీకంలో పారాయణం చేస్తే యోగసిద్ధి కలుగుతుంది. అష్టసిద్ధులూ దీనివలన కలుగును.

# అథర్వణ పాశుపతాలు

## 109. దీర్ఘాయు పాశుపతం :

ఆయుర్దా అగ్నే జరసం వృణానో ఘృత ప్రతీకో ఘృతపృష్ఠో అగ్నే॥ ఘృతంపీత్వా మధుచారు గవ్యం పిజేత పుత్రా నభిరక్షతాదిమం॥ పరింధత్త ధత్తనో వర్చసేమం జరామృత్యుం కృణుత దీర్ఘమాయుః బృహస్పతిః ప్రాయచ్ఛత్ వాస ఏతత్ సోమాయరాజ్ఞే పరిధాతవా ఉ। పరీదంవాసో అధిధాః స్వస్తయేఽభూర్గృష్టినా మభీ శస్తిపా ఉ శతం చ జీవశరదః పురూచీ రాయశ్చపోష ముపసంయయస్వ॥ ఏహ్యా శ్మానమా తిష్ఠాశ్మాభవతుతే తనూః। కృణ్వంతు విశ్వేదేవాః ఆయుష్టే శరదః శతం యస్యతేవాసః ప్రథమ వాస్యం హరామస్తంత్వా విశ్వేఽవంతుదేవాః॥ తంత్వా భ్రాతరః సువృథా వర్ధమాన మనుజాతంతాం బహవః సుజాతమ్॥

విధానం : జన్మించిన తిథి, లేదా వారం,, నక్షత్రం రోజున రోజూ ఈ సూక్తాన్ని 108సార్లు పారాయణం చేయ్యాలి లేదా ఒకరుద్రంలో సంపుటించి 108రోజులు ప్రయోగించాలి. చివరికి ఆయుష్య హోమం చేయడంవల్ల ఆయుర్దాయం పెరుగు తుంది.

## 110. ఆరోగ్యపాశుపతం :

"యదక్షితాయుర్యదివా పరేతో యదిమృత్యో రంతికం నీతిఏవ॥

తమాహరామి నిఋతే రుపస్థాదప్పార్శ మేనం శతశారదాయ॥

విధానం : అనేకరోజులదీర్ఘారోగాలు నిదానించి ఆరోగ్యం పొందడం కొరకు ఈ పాశుపతాన్ని 40 రోజులు పాశుపతప్రయోగం చేస్తారు. లగ్న రాహువు, రాహు మహర్దశ, చతుర్థరాహువు, అష్టమ రాహువు, సప్తమ రాహువు దోషాలు తొలగడానికి కూడా ఈ ప్రయోగం చేస్తారు.

## 111. ఆయుః పాశుపతం :

శతం జీవ శరదో వర్ధమానః

శతం హేమంతాన్ శతం వసంతాన్॥

శతంత ఇంద్రో అగ్నిః

శతాయుషా హవిషా హర్ష మేనమ్॥

విధానం : ఫలం, రుద్రజట వేళ్ళునూరి ఆ జలంలో 40 రోజులు అభిషేకం రుద్రజటపూలు ఆకులతో పూజ (మృత్యుంజయ సహస్రనామాలు) ఆయుర్వృద్ధి ఫలం.

## 112. కాయకల్ప పాశుపతం :

ఈశానాం త్వాభేషజానా ముజ్జేష ఆరభామహే
చక్రే సహస్రవీర్యం సర్వస్మా ఓషధేత్వా ॥
సత్యజితం శపథః యావనీం సహమానాం పురః సరాం
సర్వాః సమహ్వాయోషధీరితో నః పారయాదితి
యాశశాప శపనేన యాఘం మూరమాధధే
యా రసస్య హరణాయ జాతమారేభే తోకమత్తుసా ।
యాంతే చక్రురామే పాత్రేయాం చక్రనీల లోహితి
ఆమే మాంసేకృత్యాంయాం చక్రుస్తయా కృత్యాకృతో జహీ
దౌష్వప్న్యం దౌర్జీవిత్యం రక్షోఅభ్వ మరాయ్యః॥
దుర్ణామ్నాః సర్వాదుర్వాచ స్తా అస్మా న్నాశయామసి
క్షుధామారం తృష్ణామారమగోతా మనసత్యతామ్।
అపామార్గత్వయావయం స్వంతదప మృజ్మహే
తృష్ణామారం క్షుధామారమథో ఆక్షపరాజయమ్।
అపామార్గ త్వయావయం సర్వంతదప మృజ్మహే
అపామార్గ ఓషధీనాం సర్వాసామేక ఇద్వశీ
తేనతే మృజ్మ ఆస్థితమథ త్యమగదశ్చర॥

విధానం-ఫలం: ఈపైన ఇచ్చినదాన్ని అపామార్గ సూక్తం అంటారు. అపామార్గం అంటే ఉత్తరేణి. ఉత్తరేణి రెండు రకాలు. మామూలుగా లభించే ఉత్తరేణి గుచ్చుకుంటుంది. ఘట్ ఉత్తరేణి అనే మూలిక గుచ్చుకోనిది. అ రెండవదే ఔషధంగా పనికివస్తుంది. "బైరాంతస్ ఎస్పేరా" అనేది దీని బొటానికల్ పేరు. దీనిని మడిచి చెవిలో పెట్టుకుంటే జ్వరంతగ్గుతుంది. దీని కషాయం మూత్రపిండాల వ్యాధిని నివారిస్తుంది. ఉత్తరేణి బియ్యం ఆవుపాలలో వండి తింటే అన్ని రోగాలు తగ్గుతాయి. దీని రసంతో 40రోజులు అభిషేకిస్తే కాయకల్పం సిద్ధిస్తుంది. ఇది కందిరీగ విషాలకు, పాము విషాలకు పిచ్చికుక్క విషానికి ఔషధి. ఆదివారం కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రాలలో ఏదైనా కలిసివచ్చినప్పుడు ఈ మూలికను సూర్యోదయం సూర్య మంత్రంతో తీసి ధరిస్తే వ్యక్తులు రాజ్యాలేలుతారు.

## 113. కామెర్లవ్యాధి నివృత్తి పాశుపతం :

అనుసూర్య ముదయతాం హృద్యోతో హరిమాచ తే
గోరోహితస్య వర్ణేన తేనత్వా పరిదధ్మసి॥
పరిత్వారోహితైర్వర్ణై ర్దీర్ఘాయుత్వాయ దధ్మసి ।
యధాయ మరపా ఆసదథో అహరితో భువతీ
యా రోహిణీర్దేవత్యా గావోయా ఉత రోహిణీః॥

రూపం రూపం వయోవయస్తాభీష్ట్వా పరిదధస్మి
శుకేషు తే హరిమాణం రోఫనాకాసు దధ్మసి
అథో హారిద్రవేషు తే హరిమాణం నిదధ్మసి ॥

విధానం- ఫలం : పచ్చకామెర్లు, తెల్లకామెరలు మొదలగు లివర్‌కు సంబంధించిన వ్యాధులు, గుండె, జీర్ణకోశానికి చెందిన వ్యాధులు నివారించడానికి భాస్కరుడిని స్తుతించి ఆరోగ్యాన్ని పొందే సూక్తమిది. కేవలం 24 రోజులలోనే దాని ఫలాన్ని పొందవచ్చు. ఆరోగ్యదాయక సౌరపాశుపతం ఇది.

## 114. బొల్లి వ్యాధి నివారణ పాశుపతం

నక్తంజాతా స్యోషధే రామే కృష్ణే అసిక్నిచ
ఇదం రజని రజయ కిలాసం పలితం చ యత్॥
కిలాసం చ పలితం చ నిరితో నాశయా పృషత్
ఆత్వాస్వో విశతాం వర్ణః పరాశుక్లాని పాతయ ।
అసితం తే ప్రలయనమాస్థాన మసితం తవ
అసిక్న్యస్యోషధేనింతో నాశయా పృషత్ ॥
అస్థిజస్య కిలాసస్య తనూజస్య చయత్ త్వచి
దూష్యాకృతస్య బ్రహ్మణా లక్ష్మశ్వేతమనీ నశమ్ ॥

విధానం - ఫలం : నల్లనివావిలిని సంస్కృతంలో అసిక్ని అంటారు. అసురి అంటే తెల్ల ఆవాలు, విషాణకా (మేషశృంగి) అనే మూలికలు, ఫిట్స్‌కి (తైలశిల పాషాణం) బొల్లినివారణకు ఔషధాలుగా చెప్పబడ్డాయి. ప్రస్తుతం ఈ సూక్తంలో నల్లవావిలిని స్తుతించారు. వీటినెరిగి వీటిరంసతో 40 రోజులు పాశుపతప్రయోగం చేస్తే బొల్లి నివారించబడుతుంది.

## 115. పృశ్నిపర్ణి పాశుపతం :

శంనోదేవి పృశ్నిపర్ణ్యశం నిఋత్యా అకః
ఉగ్రాణీ కణ్వ జంభినీ తామభక్షీ సహస్వతీం ॥
సహమానేయం ప్రథమా పృశ్నిపర్ణ్య జాయత ।
తయాహం దుర్ణామ్నా శిరోవృశ్చామి శకునేరివ
అరాయ మస్యృక్పావనం యశ్చస్ఫాతిం జహీర్షతి
గర్భాదం కణ్వంనాశన పృశ్నిపర్ణి సహస్యచ ॥
గిరిమేనాం ఆవేశయ కణ్వాన్ జీవితమోపనాన్
తాస్తందేవి పృశ్నిపర్ణ్యగ్నిరి వానుదహనిహిః

పరాచ ఏనాన్ ప్రణూద కణ్వాన్ జీవితయోపనాన్
తమాంసి యత్రగచ్ఛతి తత్క్రవ్యాదో అజీగమమ్ ॥

విధానం-ఫలం : వృశ్చిపర్ణి అంటే కోలపొన్ను (నక్కతోక) దశమూలికల్లో ఇది ఒకటి. "దూదియా లగోపోడియగాన్" అనేది దీని బొటానికల్ పేరు. దగ్గు, జ్వరం, వాతంనొప్పులు తగ్గడానికి దీన్ని ఉపయోగిస్తారు. ఈ మూలికారసంలో కేవలం ఒక పాశుపతప్రయోగానికే ఇది తగ్గుతుంది.

## 116. స్త్రీ మనోవశీకరణ పాశుపతం :

యథేదం భూమ్యా అధీతృణం వాతో మధాయతీ
ఏవామథ్నామితే మనోయథామాం కామిన్యసో యథామన్నాపగా అసః
సంచేన్న యాధో అశ్వినా కామినా సం చ వక్షథః
సంవాం భగాసో అరమత్ సంచిత్తాని సముప్రతా ॥
యత్ సుపర్ణా వివక్షనో అనమీవా వివక్షవః
తత్రమే గచ్ఛతాద్ధ్రువం శల్యఇవ కల్మలం యథా ॥
యదంతరం తద్బాహ్యం యద్బాహ్యం తదంతరం
కన్యానాం విశ్వరూపాణాం మనోగృభాయౌషధే ॥
ఏయమగన్ పతికామా జనికామోఽహ మాగమమ్
అశ్వః కనిక్రదద్ యథా భగేనాహం సహాగమమ్ ॥

విధానం - ఫలం : 33 రోజులు ఈ పాశుపతప్రయోగంతో అనుకూలం లేని భార్య మనసును అనుకూలంగా మార్చుకోవచ్చు.

## 117. వ్యాపార వృద్ధి పాశుపతం :

ఇంద్రమహం వణిజం చోదయామి
సన ఐతు పురేతానో అస్తు ॥
నుదన్నరాతిం పరిపంథినం మృగం
స ఈశానో ధనదా అస్తుమహ్యామ్ ॥

## 118. మరొక వ్యాపార పాశుపతం :

శునం నోఅస్తు ప్రపణో విక్రయశ్చ ప్రతిపణ ॥
ఫలినం మా కృణోతు ఇదం హవ్యం
సంవిదానౌ జుషేథాం శునం
నోఅస్తు చరిత మత్థితంచ ॥

## 119. వేరొక వ్యాపార పాశుపతం :

యేన ధనేన ప్రవణం చరామి
ధనేనదేవా ధనమిచ్ఛ మానః
తన్మేభూయో భవతు మాకనీయో
ఉగ్నే సాతఘ్నో దేవాన్ హవిషా నిషేధః

విధానం-ఫలం : పై మూడింట్లో ఏదో ఒకటిగానీ లేక మూడుకానీ, వ్యాపారానికి జరిగిన బంధనమెటువంటిదో ఎరిగి, లేదా వ్యాపారి జాతక గ్రహ కూటమి ఏలాంటిదో ఎరిగి ఈ ప్రయోగం అవసరమైనన్ని రోజులు చేయాలి. వ్యాపారాభివృద్ధి జరుగుతుంది.

## 120. వ్యవసాయ వృద్ధి పాశుపతం :

"సీతా యుంజంతి కవయో యుగా
వితన్వతే పృథక్ ధీరాదేవేషు సుమ్నయా ॥
యునక్త సీరావియుగా తనోత కృతే యోనౌ వపతేహ బీజం ॥
విరాజ స్నుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్ సృణ్యః పక్వమా యవన్ ।

విధానం-ఫలం : పాశుపత విధానంలో పై మంత్రాన్ని అభిషేకించి, అభిషేకించిన జలం పొలంలోను విత్తనాలమీద చల్లితే, పంట ఐదారింటపెరుగుతుంది.

## 121. తేజో పాశుపతం :

"యేన హస్తీవర్చసా సంబభూవ
యేన రాజా మనుష్యే ష్వప్స్వంతః ॥
యేన దేవా దేవతామగ్ర ఆయన్
తేన మామద్య పర్చసాగ్నే వర్చస్వినం కృణు ॥

విధానం-ఫలం : ముఖంలో తేజస్సు, మనసులో ఆత్మవిశ్వాసం, సంఘంలో గౌరవం పెరగడంకొరకు, ఈ పాశుపత ప్రయోగం 21 రోజులు చేస్తారు.

## 122. ఐకమత్య పాశుపతం :

సహృదయం సామనస్యమవిద్వేషం కృణామివ
అన్యో అన్యమభీహర్యత వత్సం జాతమినాఘ్న్యాః ॥
అనువ్రతః పితుః పుత్రో మాత్రాభవతు సంమనాః
జాయాపత్యే మధుమతీం వాచం వదతుశాంతివామ్
మాభ్రాతా భ్రాతరం ద్విక్ష న్మా స్వసార ముత స్వసా

సమ్యంచః సవ్రతాభూత్వా వాచం వదత్ భద్రయా
యేన దేవా న వియంతి నోచ విద్విషతే మిథః
తత్ కృణ్మో బ్రహ్మావోగృణే సంజ్ఞానం పురుషేభ్యః ॥

విధానం - ఫలం : ఇది 41 రోజుల ప్రయోగం దీనివల్ల కుటుంబంలోను, గ్రామంలోను, సమాజంలోను ఐకమత్యత సిద్ధిస్తుంది.

**123. వాజీ కరణ పాశుపతం :**

యంత్వా గంధర్వో అఖసద్ వరుణాయ మృతభ్రజే
తాంత్వావయం ఖనామస్యోషధిం శేఫహర్షిణిమ్ ॥
ఉదుషాఉదు సూర్య ఉదిదం మామకం వచః
ఉదేజతు ప్రజాపతిర్వృషా శుష్మేణ వాజినా ॥
యథాస్మ తే విరోహితోఽభి తప్తమివానతి
తతస్తే శుష్మవత్తర మియం కృణోత్వోషధిః ॥
ఉచ్ఛుష్మౌషధీనాం సారఋషభాణామ్
సంపుం సామింద్ర వృష్ణ్యమస్మిన్ ధేహితనూవిశన్ ॥
అపాంరసః ప్రథమజోఽథో వనస్పతీనామ్
ఉతసోమస్య భ్రాతాస్సు తార్శమసి వృష్ణ్యమ్ ॥
అద్యాగ్నే అద్య సవితురద్య దేవిసరస్వతి
అదాస్య బ్రహ్మణస్పతే ధనురివా తానయాపసః॥
అహంతనోమి తేపసోఽది జ్యామివ ధన్వని
క్రమస్వర్శ ఇవరోహిత మనవగ్లాయతా సదా ॥
అశ్వస్యా శ్వతరస్యాజస్య పేత్వస్య చ॥
అథ ఋషభస్యయే వాజాస్తానస్మిన్ దేహితనూవిశన్

విధానం - ఫలం : ఇది 120 రోజులప్రయోగం. రకరకాలమూలికల రసం పిండి దానితో అభిషేకించి తీర్థాన్నిసేవిస్తే నపుంసకత్వం నశించి పుంస్త్వం అభివృద్ధి అవుతుంది.

**124. నిద్రా పాశుపతం :**

సహస్ర శృంగో వృషభో యఃసముద్రా ధ్రువాచరత్
తేన సహస్యేనావయం నిజనాన్ స్వాపయామసి ।

నభూమింవాతో ఆతివాతినాతి పశ్యతి కశ్చన
స్త్రియశ్చ సర్వాఃస్వాపయ శునశ్చేంద్ర సఖాచరన్
ప్రోష్ఠేశమూ స్తల్పేశయా నారీర్యా వహ్యాశీపరీః
స్త్రీయో యాః పుణ్యగంధయ స్తాః సర్వాః స్వాపయామసి ॥
ఏజదేజగ్రభం చక్షుః ప్రాణమజగ్రభమ్
అంగాన్య జగ్రభం సర్వారాత్రీణా మతిశర్వరే ॥
య ఆస్తే యశ్చరతి యశ్చతిష్ఠన్ విపశ్యతి
తేషాం సదధ్మో అక్షీణి యథేదం హర్మ్యంతథా ॥
స్వప్తుమాతా స్వప్తుపితా స్వప్తు శ్వా స్వప్తు విశృతిః
స్వపంత్వసైః జాతయః స్వప్త్వయమభితో జనః॥
స్వప్నస్వప్నాభీ కరణేన సర్మం నిష్వాపయా జవిః ।
ఓత్సూర్య మన్యాన్ త్స్వాపయావ్యుషం
జాగృతా దహమింద్ర ఇవారిష్టో అక్షితః ॥

విధానం-ఫలం : జూదములు, దొంగలు, వ్యభిచారులు, యోగులు, మొదలైన వారికి నిద్రపట్టదు. నిద్ర అమ్మవారి స్వరూపం. అంతా సుఖంగా సిద్ధిస్తుంటే నిద్ర పట్టనివాడు బాధపడుతూ ఉంటాడు. ఏమిటి పాపం? అనిపిస్తుంది. వ్యక్తి మెల్లిగా గాఢనిద్రలోకి వెళుతూఉంటే అతడి అంతర్‌శక్తి వేయికొమ్ముల ఎద్దులాంటి రెక్కలుగల జంతువుగా మేల్కొని మత్తెక్కి నివారిస్తుంది. ఇది ప్రతిజీవిలోని అంతస్ చేతనంలో నిబిడీకృతమై ఉంటే పరమశక్తి. కేవలం ఒకరోజు ఈ పాశుపత ప్రయోగంచేస్తే ఇక ఆ జీవికి అనిద్రాభయం ఉండదు.

## 125. రోహిణీ పాశుపతం :

రోహణ్యసి రోహణ్య స్థ్నశ్ఛిన్నస్య రోహణి
రోహయేద మరుధతి ।
యత్తేరిష్టం యత్తేద్యుత్తమస్తి వేష్టంత ఆత్మని
ధాతాతద్ భద్రయా పునః సందధత్‌పరుషా పరుః
సంతే మాంసస్య విస్రస్తం సమస్థ్వపి రోహతు
లోమలోమ్నా సంకల్పయాత్వచా సంకల్పయాత్వ చం
అసృక్ తే అస్థిరోహతుచ్ఛిన్నం సంధ్యేహ్యోషధే ॥
స ఉత్తిష్ఠప్రేహి ప్రద్రవ రథః సుచక్రః సుపవిః

సునాభిః ప్రతిం తిష్ఠోర్ధ్వః ॥
యదికర్తం పతిత్వా సంశశ్రే యదిపాశ్మా
ప్రహృతో జఘాన। ఋభూ రథస్యేవాంగాని
సందధత్ పరుషా పరుః ॥

విధానం-ఫలం : మాంసరోషిణిగా పిలవబడే ఈ మూలిక బొటానికల్‌పేరు "సోయామిబాఫేబ్రిఫిగా" దీనితో స్త్రీల గైనిక్ ప్రాబ్లమ్స్, ఫైల్స్, మలబద్ధకం వగైరాలు తగ్గించవచ్చు. ప్రయోగం 21 రోజులు.

**126. జయ పాశుపతం :**

మమాగ్నే పర్చో విహవేష్వస్తు వయం త్వేంధా నా సవ్యం పుషేమ ।
మహ్యం నమంతా ప్రదిశశ్చస్రస్త్వయా ధ్యక్షేణ పృతనా జయేమ॥

విధానం-ఫలం : 11 రోజులు ఈ మంత్రం పాశుపత ప్రయోగంచేసి, ఏదైనా కార్యానికి వెళ్ళినప్పుడు పై మంత్రం లోలోపల చదువుకుంటూవెళితే తప్పక కార్యజయం కలుగుతుంది.

**127. సర్ప పాశుపతం :**

దదిర్హిమహ్యం వరుణో దివః కవిర్వచోభి రుగ్రైర్ని రిణామితే విషమ్ ॥
ఖాతమఖాతముత సక్తమగ్ర భమిరేవ ధన్వన్ నిజజాసతే విషమ్ ॥

**128. విషహర పాశుపతం :**

తాబువం నతాబువం నఘేత్ త్వమసి తాబువమ్ ॥ తాబువేనా రసం విషమ్॥
తస్తువం న తస్తువం నఘేత్ త్వమసి తస్తువమ్॥ తస్తువేనా రసం విషమ్ ॥

విధానం-ఫలం : ఈరెండు (127,128) మంత్రాలలో ఏదైనా సరే 21 రోజులు పాశుపత ప్రయోగంచేసి సిద్ధించుకుంటే, పాముకాటు పడినవారికి నీరు మంత్రించి ఇచ్చినా వేపమండతో దిగదుడిచినా సరే విషం దిగిపోతుంది.

**129. రోగ శాంతి పాశుపతం :**

ఏకాచమే దశచమేఽపవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ।
ద్వేచమే వింశతిశ్చమేఽపవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమె మధులాకరః ॥
తిస్రశ్చమే త్రింశచ్చ మేఽసవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః॥

చతస్రశ్చమే చత్వారింశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః।
పంచచమే పంచాశచ్చమే ఽ పవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః॥
సప్తచమే సప్తతిశ్చ మేఽ పవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధేమే మధులాకరః
అష్టచమే అశీతిశ్చ మేఽ పవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మభులాకరః ॥
నవచమే నవతిశ్చమేఽ పనక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
దశచమే శతం చ మేఽ పవక్తాకార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
శతంచమే సహస్రం చాపవక్తార ఓషధే
ఋతజాత ఋతావరి మధుమే మధులాకరః ॥

విధానం-ఫలం : మధులా అనే పేరుగల ఔషధి ఈసూక్తంలో స్తుతించబడింది. దీన్ని 21 రోజులు పాశుపతప్రయోగంచేస్తే చాలు ఎటువంటి రోగమైనా తగ్గుతుంది.

## 130. నూతన గృహ పాశుపతం

యజూంషి యజ్ఞేసమిధః స్వాహాగ్నిః ప్రవిద్యా నిహవో యునక్తు యునక్తుదేవః సవితా ప్రజానన్నస్మిన్ యజ్ఞే యునక్తు యునక్తుదేవః సవితా ప్రజానన్నస్మిన్ యజ్ఞే మహిషః స్వాహా ॥ ఇంద్రం ఉక్థమదాన్యస్మిన్ యజ్ఞే ప్రవిద్వాన్ యునక్తు సుయుజః స్వాహా ॥ ప్రైషా యజ్ఞే నివిదః స్వాహా ॥ శిష్టాః పత్నీభిర్వహ తేహాయుక్తాః ఛందాంసి యజ్ఞే మరుతః స్వాహా॥ మాతేవ పుత్రం పిపృతేహాయుక్తాః ఏయమగన్ బర్హిషా ప్రోక్షణి భీర్యజ్ఞం తన్వానాతః స్వాహా॥ విష్ణుర్యునక్తు బహుధా తపాంస్యస్మిన్ యజ్ఞేసు యజ్ఞః స్వాహాత్వషాయునక్తు బహుథానురూపా అస్మిన్ యజ్ఞే సుయుజః స్వాహా ॥ భగోయునక్త్వ శిషోన్వస్మా అస్మిన్ యజ్ఞే ప్రవిద్వాన్ యునక్తు సుయుజః సోమోయునక్తు బహుధా పయాంస్యస్మిన్ యజ్ఞేసుయుజ స్వాహా॥ ఇంద్రో యునక్త బహుధా వీర్యాణ్యస్మిన్ యజ్ఞేసు యుజః స్వాహా ॥ అశ్వినా వర్ధయతౌ, బృహస్పతే బ్రహ్మణా యాహ్యా ర్వాంగ్ యజ్ఞో అయం స్వరిదం యజమానాయ స్వాహా ॥

విధానం-ఫలం : వాస్తుదోషాలున్న ఇంట లేక నూతనగృహంలో ఈ పై మంత్రాలు తొమ్మిదింటిని పాశుపత ప్రయోగంచేస్తే వాస్తుదోషాలు, భూమిలో ఉండే ఎముకలు, శిథిలవస్తుదోషాలు తొలగిపోతాయి.

## 131. స్త్రీ వశీకరణ పాశుపతం :

యథా వృక్షం విబుజా సమంతం పరిషస్వజే ॥

ఏవాపరిష్వజస్వ మాం యథామాం కామన్యసో యథామన్నాపగా అసః॥

విధానం-ఫలం : కామం తక్కువ ఉండిగానీ, అనారోగ్యమువల్లగానీ, పరపురుష చింతనవల్లగానీ చేరిరాకుండా ఉండే భార్యకొరకు, ఈ ప్రయోగం చెప్పబడింది. కేవలం 11 రోజుల పాశుపతప్రయోగానికీ లత చెట్టుకు అల్లుకున్నట్లుగా భార్య భర్త కౌగిలిలో చేరుతుంది.

## 132. నేత్రపాశుపతం :

ఆబయో అనాబయో రసస్త ఉగ్ర ఆబయో ।

ఆతే కరంభ మద్మసి ।

త విలికే ఉ వేలయా వాయమైలబ ఐలయిాత్ ॥

బభ్రుశ్చ బభ్రుకర్ణశ్చాపేహి నిరాల ।

అలసాలాసి పూర్వాసి సిలాంజాలా స్యుత్తరా ॥

నీలా గలాసాలా ॥

విధానం-ఫలం : ఎటువంటి నేత్రరోగమైనాపరే 12 రోజుల పాశుపత ప్రయోగంతో దారికివస్తుంది.

## 133. ఈర్ష్యా నాశన పాశుపతం :

అదో యత్తే హృది శ్రితం మనస్కం పతయిష్టకం ।

తతస్త ఈర్ష్యాం ముంచామి నిరుష్మాణం దృతేరివ ॥

విధానం-ఫలం : మీరు ఈర్ష్యాగుణాన్ని త్యజించదలచినా, ఇతరుల మనసులో మీ ఎడల గల ఈర్ష్యను తీసివేయదల్చినా మీరు ఈ ప్రయోగం 11 రోజులు చేయవచ్చు.

## 134. చర్మ పాశుపతం :

అవ మాపాస్మన్త్సృజపశీనన్ మృదయాసిసః

ఆ మా భద్రస్యలోకేసాప్మన్ ధేహ్యావిహ్నుతమ్ ॥

యోనః పాప్మన్ న జహాసి తముతా జహిమోవయం

పథామనువ్యావర్తనే ఉ న్యం పాప్మాను పద్యతామ్ ॥

అన్యత్రాస్మన్న్యుచ్యతు సహస్రాక్షో అమర్త్యః

యంద్వేషామ తమృచ్ఛతు యముద్విష్మస్త మిజ్జహి ॥

విధానం-ఫలం : ఎటువంటి చర్మరోగాలైనా 41 రోజులలో ఈ పాశుపత ప్రయోగంలో తీసివేయవచ్చు.

**135. గో పాశుపతం :**

ఉపరి బభ్రుః గౌః గాయత్రీ ఛందః ఆయం గౌః

పృశ్ని రక్రమీా దసదన్మాతరం పునః చ ప్రియన్ త్స్వః

విధానం-ఫలం : గోసంపద కోరుకునేవారు 120 రోజులు ఈ ప్రయోగం చేస్తే విరివిగా గోవులు లభిస్తాయి.

**136. జల పాశుపతం :**

ఇదమిన్ వా ఉ భేషజమిదం రుద్రస్య భేషజం
యేనేఘు మేక తేజావాం శతశల్యామపప్రవత్ ।
జాలాషే ణాభిషించత జాలాషేణోవ సించత
జాలాషముగ్రం భేషజం తేన నో మృడజీవసే ॥
శంచనో మయశ్చనో మాచనః కించనామమత్
క్షమారపో విశ్వంనో అస్తుభేషజం సర్వం నో అస్తు భేషజం ॥

విధానం-ఫలం : ఈపాశుపతం 120 రోజులు ప్రయోగించినవారు, జువ్వికట్ట "Y" ఇంగ్లీషు అక్షరం ఆకారంగల పంగలకర్ర తీసుకొని రెండుకొసలు పట్టుకొని నడిస్తే (మంత్రం చదువుతూ) జలం ఉన్నచోట కట్టకిందికి వంగుతుంది.

**137. కుష్ఠరోగ నివృత్తి పాశుపతం :**

అశ్వత్థో దేవసదన స్తృతీయ స్వామితో దివి
తత్రామృతస్య చక్షణం దేవాః కుష్ఠమవన్వత
హిరణ్మయీా నౌరచర ద్ధిరణ్య బంధనా దివి
తత్రామృతస్య పుష్పందేవాః కుష్ఠసువన్వత ।
గర్భో అస్యోషధీనాం గర్భో హిమవతా ముత
గర్భో విశ్వస్య భూతస్యేమం మే అగదం కృధి ॥

విధానం-ఫలం : ఈ ఔషధి ఏమిటో తెలిసిరావడంలేదు. కానీ ఈ మంత్రాన్ని 120 రోజులు పాశుపతప్రయోగంచేస్తే ఎంత ముదిరిన కుష్ఠయినా తగ్గిపోతుంది.

**138. పిప్పలీ పాశుపతం :**

పిప్పలీ క్షి ప్త భేషజ్యా తాతివిద్ధ భేషజీ ।
తాందేవాః సమకల్ప యన్నియం జీవితవా అలం ॥

పిప్పల్యః సమవదం తాయతీ ర్జననాదధి
యంజీవ మశ్న వామహైనస రిష్యాతి పూరుషః ॥
అనురాస్త్వా న్యఖనన్ దేవాస్త్వోదపవన్ పునః॥
వాతీకృతస్య భేషజీ మథో క్షి ప్తస్య భేషజీమ్ ॥

**విధానం - ఫలం :** పిప్పిళ్ళు కొద్దిగావెచ్చచేయడం ద్వారా శుద్ధిచేసి నూరిపొడి చేసి పాశుపతప్రయోగంలో 11 రోజులు ఈ తీర్థం సేవిస్తే వీర్యవృద్ధి, జీర్ణశక్తివృద్ధి, విషప్రయోగాలకు విరుగుడు, టి.బి.దగ్గు ఎక్కిళ్ళు, ఆర్థరైటిస్ తగ్గుతాయి. గర్భిణీ స్త్రీలకు ఇవ్వకూడదు. దీనికి విరుగుడు సొంఠిచూర్ణం కలిపిన నిలువనీళ్ళు.

### 139. మనో పాశుపతం :

ఇమంమే అగ్నే పురుషం ముముగ్ధ్యయంయో బద్ధః సుధతో లాలపీతి ॥
అతోధి కృణవద్ భాగధేయం యదా నున్మదితోఽసతి ॥
అగ్నిష్టే నిశమయతు యదితే మన ఉద్యుతం
కృణోమి విద్వాన్ భేషజం యథానున్మది తోఽససి ॥
దేవైన సాదున్మదిత మున్మత్తం రక్షసస్పరి
కృణోమి విద్వాన్ భేషజం యదానున్మదితోఽసతి ॥
పునస్త్వా దురప్సరసః పునరింద్రః పునర్భగః
పునస్త్వా దుర్విశ్వే దేవా యథానున్మదితోఽససి ॥

**విధానం-ఫలం :** మానసిక రుగ్మతలు (సైక్రియాటిక్), మనస్సునుండి శరీరానికి వ్యాపించిన రుగ్మతలు (సైకోసిమాటిక్), పిచ్చి మొదలైన రుగ్మతలు తగ్గించడానికి ఈ పాశుపతం ఉపయోగపడుతుంది. 40 రోజులు ప్రయోగం చేస్తూ ప్రతిరోజూ రోగికి తీర్థం ఈయాలి. అభిషేక జలంతో రోగికి స్నానంచేయించాలి.

### 140. ఋణవిమోచన పాశుపతం :

యద్ధస్తాభ్యాం చక్రువు కిల్బిషాణ్యక్షుణాం గత్నుముపలిప్సమానాః ।
ఉగ్రంపశ్యే ఉగ్రజితౌ తదద్య రసావను దత్తా మృణం నః ॥
ఉగ్రంపశ్యే రాష్ట్రభృత్ కిల్బిషాణియ దక్షవృత్త దత్తం న ఏతత్ ।
ఋణాన్నో నర్ణమేర్త్సమానో యమస్య లోకే అధిరజ్జురాయత్ ॥
యస్మా ఋణం యస్యజాయా ముపైమి యంమాచమనో అభ్యైమి దేవాః ॥
తేనాచం వాదిషుర్మోత్తరాం మద్గీవపత్నీ అప్సరసావధీతమ్ ॥

విధానం-ఫలం : చంద్రకట్టుతో 8 చెక్కమేకులు చెక్కించి, ఆవుపేడతో అలికిన భూమిమీద కూర్మయంత్రం నిర్మించి (ముగ్గుతో), దానిమీద ధర్భాసనంపరిచి, ఆసనం చుట్టూ భూమిలో 8 దిక్కుల చెక్కమేకులుదించి, ఈ ప్రయోగం 21 రోజులు చేస్తే ఎటువంటి ఋణమైనా తీరుతుంది.

**141. సభావశ్య పాశుపతం :**

సభాచమాస మితశ్చానతం ప్రజాపతేర్దుహతరౌ సంవిదానే ॥
యేనా సంగచ్ఛా ఉపమాస శిక్షాచ్చాగు వదాని పితరః సంగతేషు ॥
విద్మతే సభేనామ నరిష్టా నామవా అసి
యే తే కేసభాసదస్తేమే సంతుసవాచసః॥
ఏషామహం సమాసీ నానాం వర్చో విజ్ఞాన మాదదే
అస్యాః సర్వస్యాః సంసదో మామింద్ర భగినం కృణు ॥
యద్ వో మనః పరాగతం యద్ బద్ధమిహ వేహవా
తద్వ ఆవర్తయామసి మయివో రమతాం మనః ॥

విధానం-ఫలం : 40 రోజుల పాశుపతప్రయోగం తరువాత, నలుగురి మధ్యకూర్చుని ఉన్నప్పుడు ఈ మంత్రాన్ని మానసికంగా జపిస్తే పితృదేవతల దయవల్ల జనులు వశమౌతారు, సమాజంలో గౌరవం పెరుగుతుంది, సభాకర్షణ కలుగుతుంది.

**142. ధన పాశుపతం :**

ధాతా దధాతు నోరయి మీశానో జగతస్పతిః ॥ సనః పూర్ణేన యచ్ఛతు ॥

విధానం-ఫలం : 120 రోజులు పాశుపతప్రయోగం లేదా 40 రోజులు ప్రయోగం 4 పాశుపతాల వాహనంచేస్తే జీవితంలో ఇక ధనానికి కొదవుండదు.

**143. విష్ణు పాశుపతం :**

విష్ణోర్నుకం ప్రావోచం వీర్యాణి యః పార్థివాని విమమేరజాంసి ॥
కంప్రావోచం వీర్యాణి యః పార్థివాని విమమేరజాంసి॥
యోఅర్క ఛాయా దుత్తరం రథస్థం విచక్రమాణ స్తేధా థోరుగాయః ॥
ఓం నమో భగవతే రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి ॥

విధానం-ఫలం : బుధనక్షత్రాలలో జన్మించినవారు, లగ్నంలో బుధుడు ఉన్నవారు, బుధమహర్దశ, అంతరాలు నడుస్తున్నావారు, ఈ మంత్రాన్ని పాశుపత ప్రయోగం 21 రోజులు చేస్తే ధన, కీర్తి ప్రతిష్ఠలను పొందుతారు.

**144. జూద పాశుపతం :**

యథా వృక్ష మశనిర్విశ్వాహా హంత్యప్రతి
ఏవాహమద్య కితవానక్షైఃవధ్యా సమప్రతి

కూతంమే దక్షిణేహస్తే జయోమే సవ్యఆహితః.

గోజిత్ భూయాసమశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్

**విధానం-ఫలం :** ఈసూక్తానికి మాయావి ఇంద్రుదు అధిష్ఠాన దేవత. మనస్ఫూర్తిగా 11 రోజులు ఈ ప్రయోగం చేసిన వారికి జూదం కాయవలసిన నెంబర్లు మనసులోకి వస్తాయి.

**145. శ్రేష్ఠతా పాశుపతం :**

బృహస్పతిర్నః పరిపాతు పశ్చాదుతో త్తరస్మా దధరాదధాయోః ।

ఇంద్రః పురస్తాదుత మధ్యతో నః సఖా సఖిభ్యో పరీయః కృణోతు ॥

**విధానం-ఫలం :** ఏకాగ్రతతో 17 రోజులు ఈ పాశుపత ప్రయోగంచేస్తే బృహస్పతి ఇంద్రులు అనుగ్రహించి, శ్రేష్ఠమైన పదవులను, ఉన్నతిని ఇస్తారు.

**146. శాప మోచన పాశుపతం :**

యోనః శాపాన శపతః శపతో యశ్చనః శపాత్

వృక్ష ఇవ విద్యు దాశు ఆమూల్యాదనుశుష్యతు.

**విధానం-ఫలం :** 40 రోజుల పాశుపతప్రయోగంలో ఏరకమైన శాపమైనా తొలగిపోతుంది.

**147. అమావాస్యా పాశుపతం**

యత్తే దేవా అకృణ్వన్ భాగధేయ మమావాస్యే సంవసంతో మహిత్వా తేనానో యజ్ఞ పిపృహి విశ్వవారేరయిం నోధేహి సుభగే సువీరం ॥ అహమేవా స్మ్యమా వాస్యా మామా వసన్తి సుకృతో మయీమే ॥ మయిదేవా ఉభయే సాధ్యాశ్చేంద్ర జ్యేష్ఠాః సమగచ్ఛంత సర్వే। ఆగన్ రాత్రీ సంగమనీవ సూనామూర్జం పుష్టం వస్వా వేశయంతీ ॥ అమావాస్యా యైహవిషా విధేమోర్జం దుహానా పయసా న ఆగన్ ॥

అమావాస్యే న త్వదేతాన్యన్యో విశ్వరూపాణి పరిమూర్జజాన ॥యత్ కామాస్తే జుహుమస్తన్నో అస్తువయం స్యామ పతయో రయీణామ్ ॥

**విధానం-ఫలం :** అమావాస్య జన్ములు, గురుచండాల యోగంలో పుట్టినవారు పిత్రుశాపాలు కలిగి ఉంటారు. వీరు ప్రతి అమావాస్యకు ఈ పాశుపత ప్రయోగం చేయ్యాలి. తండ్రి, తాతగార్ల తిథిలలో కూడా ఈ పారాయణం చేయాలి. పిత్రు పక్షాలలో తప్పక రోజూ పాశుపత విధానంలో జపించాలి.

**148. పౌర్ణమీ పాశుపతం :**

పూర్ణా పశ్చాదుత పూర్ణా పురస్తాదున్మధ్యతః పౌర్ణ మాసీ జిగాయ॥ తస్యాం దేవైః సంవసన్తో మహిత్వా నాకస్యపృష్టే నమిషా మదేమ। వృషభం వాజినం వయం

పౌర్ణమాసం యజామహే ॥ సనోదదాత్వక్షీతాం రయిమను పదస్వతీం ॥ ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వారూపాణీ పరిమూర్జజాన ॥ పతయోరయిణాావ్ ॥ పౌర్ణమాసీప్రథమా యజ్ఞయాసీ దహ్నాం రాత్రీణా మతిశర్వరేషు॥ యేత్వాం యజ్ఞైః యజ్ఞియే అర్థయస్త్వమీతే నాకే సుకృతః ప్రవిష్ఠాః॥

**విధానం-ఫలం :** 16 కళలతో సముద్రంనుండి చంద్రుడితోబాటుగా జన్మించిన అమ్మవారు పరిపూర్ణ, మహానిత్య, పౌర్ణమిస్వరూపం, కనుక అమ్మ అనుగ్రహంకొరకు ప్రతి పౌర్ణమికి ఈ పాశుపతం ప్రయోగించాలి.

### 149. ఇంద్ర పాశుపతం :

త్రాతారమింద్ర మవితారమింద్రం హవే హవే సుహవం శూరమింద్ర
హవేను శక్రం పురుహూత మింద్రం స్వస్తి న ఇంద్రో మఘవాన్ కృణోతు ॥

**విధానం-ఫలం :** ఇంద్రుడు మనస్సుకు అధిష్ఠాన దేవత. మనోదృఢత్వం కొరకు ధైర్యంకొరకు, చక్కని సంస్కారము ఏర్పడటం కొరకు ఇంద్రపాశుపతం 40 రోజులు ప్రయోగించాలి.

### 150. దుఃస్వప్న శాంతి పాశుపతం :

స్వప్నే అన్నమశ్నామి నప్రాత రధిగమ్యతే ॥
సర్వం తదస్తు మే శివం స హితద్ దృశ్య తే దివా ॥

**విధానం-ఫలం :** నిజజీవితంలో మనకోరికలు, కష్టాలు, భయాలు మొదలైనవి కలగాపులగంగా మారి దుఃస్వప్నాలౌతాయి. ఒక్క పాశుపతప్రయోగంతో వీటిని అంతం చేయవచ్చు.

### 151. పతివశీకరణ పాశుపతం :

రథజితాం రాథజితేయీనా మప్సరసా మయం స్మరః
దేవా ప్రహిణుత స్మరమసౌ మా మనుశోచతు ॥
అసౌ మే స్మరతాదితి ప్రియో మే స్మరతాదితి
దేవాః ప్రహిణుత స్మరమసౌ మామను శోచతు ॥
యథామమ స్మరాదసౌ నాముష్యాహం కదాచన
దేవాః ప్రహిణుత స్మరమసౌ మామనుశోచతు
ఉన్మాదయత మరుత ఉదంతరిక్ష మాదయ
అగ్న ఉన్మాదయా త్వమసౌ మా మనుశోచతు ॥

**152. స్మర పాశుపతం :**

నిశీర్షతో నిపత్తతో ఆధ్యో నితిరాహితే
దేవాః ప్రహీణుత స్మర మసౌ మా మనుశోచతు ?
అనుమతేన్విదం మన్యస్వాకూతే సమిదం నమః
దేవాః ప్రహిణుత స్మర మసౌ మామనుశోచతు ॥
యద్ధావసి త్రియోజనం పంచయోజన మాశ్వినం
తత స్త్వం పునరాయసి పుత్రాణాం నో అసః పితా ॥

విధానం-ఫలం : ఇది 8రోజుల సాధన పాశుపతపరాయణంలో తెల్ల ఆవాలు మంత్రించి భర్తనడిచే స్థానంలో చల్లితే అతడు వశుడౌతాడు.

151,152 పాశుపతాల ఫలితం ఒకటే.

**153. గౌః పాశుపతం :**

ప్రజాపతిశ్చ పరమేష్ఠీ చ శృంగే ఇంద్రః శిరో అగ్ని ర్లలాటం యమః కృకాటం
సోమరాజా మస్తిష్కో ద్యౌ రుత్తరహనుః పృథివ్యధరహనుః ॥
విద్యుజ్జిహ్వా మరుతోదంతా రేవతీ గ్రీవాః కృత్తికాస్కంధా ధర్మోవహః॥
విశ్వం వాయుః స్వర్గలోకః కృష్ణద్రవం విదరిణీ నివేష్యః॥
శ్యేనః క్రోడోఽంపర్జన్యం బృహస్పతిః కహద్ బృదాతీః కీకసాః ॥
మిత్రశ్చ వరుణశ్చాహ త్వష్టాచార్యమాచ దోషణి మహాదేవో బాహుః
ఇంద్రాణీ భసత్ వాయుః పుచ్ఛం పవమానో బాలాః
బ్రహమచ క్షత్రంచ శ్రోణీ బలమూరూ
ధాతాచ సవితా చాష్ఠీవంతౌ జంఘా గంధర్వా
అప్సరసః కుష్ఠికా అదితః శఫాః ॥
చేతో హృదయం యకృన్మేధా వ్రతం పురీతత్ ॥
క్షుత్ కుక్షిరిరా వనిష్ఠః పర్వతాః ప్లాశయః॥
క్రోధో వృక్కౌ మన్యురాండౌ ప్రజాశేపః॥
నదీసూత్రీ వర్షస్య పతయ స్తనా యత్నురూధః ॥
విశ్వవ్యచా శ్చర్మౌషధయో లోమాని నక్షత్రాణిరూపం ।
దేవజనాగుదా మనుష్యా అంత్రాణ్యత్రా ఉదరమ్॥
రక్షాం సిలోహితమిత అంత్రాణ్యత్రా ఉదరమ్ ॥

రక్షాం సిలోహితమిత రజపా ఊబధ్యమ్ ।
అభ్రం పీబో మజ్జా నిధనమ్ ॥
అగ్ని రాసీన ఉత్థితో ఉ శ్వినా ।
ఇంద్రః ప్రాంజ్ తిష్ఠన్ దక్షిణా తిష్ఠన్ యమః ॥
ప్రత్యజ్ తిష్ఠన్ ధాతోదజ్ తిష్ఠన్ త్సవితా
తృణాని ప్రాప్తః సోమోరాజా
మిత్ర ఈక్షమాణ ఆవృత్త ఆనందః
యుజ్యమానో వైశ్వదేవో యుక్తః ప్రజాపతి ర్విముక్త॥ సర్వం ।
ఏతద్వై విశ్వరూపం సర్వరూపం గోరూపమ్॥
ఉపైనం విశ్వరూపాః సర్వరూపాః పశవః తిష్ఠంతి య ఏవం వేద ॥

విధానం-ఫలం : ఈసూక్తం 108 సార్లు పారాయణం చేయాలి. లేదా పాశుపత విధానంలో సంపుటించి పంచగవ్యాలతో అభిషేకిస్తే అనేక జన్మల పాపాలు అంతమై సహస్రగోదాన ఫలం లభిస్తుంది.

## 154. ప్రత్యంగిరా పాశుపతం :

యాం కల్పయంతి వహతౌ వధూమివ విశ్వరూపాం హస్తకృతాం
చికిత్సవః సారాదేత్వప నుదాం ఏనామ్ ॥
శీర్షణ్వతీనుస్వతీ కర్ణినీ కృతాకృతా సంభృతా విశ్వరూపా
సారాదేత్వపనుదాం ఏనామ్ ॥
శూద్రకృతా రాజకృతా స్త్రీకృతా బ్రహ్మా భిః కృతా
జాయా పత్యానుత్తేవ కర్తారం బంధ్విచ్ఛతు॥

విధానం-ఫలం : ఈ ప్రత్యంగిరను, పాశుపతవిధానంలో 41 రోజులు చేస్తే అంతర్ బహిశ్శత్రువులు, తాంత్రిక ప్రయోగాలు, వాటిప్రేరకులు, అనుమోదకులు అంతా అంతమౌతారు.

## 155. హిరణ్య పాశుపతం :

అగ్నేః ప్రజాతం పరియద్ధిరణ్య మమృతందధ్రే అదిమర్త్యేషు ॥ సఏనద్ వేదన ॥ ఇదేనమర్హతి జరామృత్యుర్భవతి యోబిభర్తి ॥ యద్ధిరణ్యం సూర్యేణ సువర్ణం ప్రజావంతో మనవః పూర్వే ఈషిరే ॥ తత్ త్వా చంద్రం వర్చసా సం సృజత్వాయుష్మాన్ భవతియో బిభర్తిః ఆయు ష్వేత్వా పర్చసే త్వౌజిసే చబతాయచ॥ యథా హిరణ్యా తేజసా విభాసాసి త్వౌజిసే చబలాయచ ॥ యథా హిరణ్యా తేజసా విభాసాసి జనా అను ॥ యద్వేద రాజా వరుణో వేదవేదో బృహస్పతిః॥ ఇంద్రోయద్ వృత్రహా వేదతత్ త ఆయుష్యం భువత్ తత్తే పర్చస్వంఉ భవత్ ॥

విధానం-ఫలం : బంగారం ధరించేప్పుడు, ఆకొత్త ఆభరణాలను శ్రీసూక్తం తోను ఈ మంత్రపాశుపతంతోను అభిషేకించి ధరించాలి.

## 156. నక్షత్ర పాశుపతం :

చిత్రాణిం సాకం దివిరోచనాని సరీసృపాణి భువనే జవాని । తుర్మిశం సుమతి మిచ్ఛమానో అహాని గీర్భిః సపర్యామి నాకం ॥ సుహవమగ్నే కృత్తికా రోహిణీ చాస్తుభద్రం మృగశిరః శమార్ద్రా। పునర్వసూ సూనృతా చారు పుష్యోభాను రాశ్లేషా అయనం మఘామే । పుణ్యం పూర్వా ఫల్గున్యా చాత్ర హస్తశ్చిత్రా శివాస్వాతి సుఖోమే అస్తురాధే విశాఖే సుహవాను రాధా జ్యేష్ఠా సునక్షత్ర మరిష్ట మూలం॥ అన్నం పూర్వా రాజతాం మే ఆషాఢా ఊర్జం దేవ్యుత్తరా ఆవహంతు ॥ అభిజిన్మే రాసతాం పుణ్యమేవ శ్రవణః శ్రవిష్ఠాః కుర్వతాం సుపుష్టిం ఆమే మహచ్ఛతభిషక్ వరీయ ఆమేద్వయా ప్రోష్టపదాసు శర్మ ॥ ఆ రేవతీ చాశ్వయుజౌ భగంమ ఆమేరయిం భరణ్య ఆవహంతు ।

విధానం-ఫలం : జన్మనక్షత్రదోషం తొలగడానికి ఈ పాశుపత ప్రయోగం చేస్తారు. ప్రతిసంవత్సరం జన్మనక్షత్రంతో ఇవి చేసుకోవడం మంచిది.

## 157. ముహూర్త పాశుపతం :

యాని నక్షత్రాణి దివ్యంతరిక్షే అప్సు భూమౌ యాని నగేషుదిషు ప్రకల్పయం శ్చంద్రమా యాన్యేతి సర్వాణి మమైతాని శివాని సంతు ॥ అష్టావింశాని శివాని శగ్మాని సహయోగం భజంతుమే ॥ యోగం ప్రపద్యే క్షేమంచ క్షేమం ప్రపద్యే యోగంచ నమో హోరాత్ర్యా భ్యామస్తుః స్వస్తితంమే సుప్రాతః సుసాయం సుదివంసుమృగం సుశకునం మే అస్తు ॥ సుహవమగ్నే స్వప్త మర్త్యమర్త్యం గత్వా పునరాయాభినందన్ అనుహవం పరిహవం పరివాదం పరిక్షవం సర్వైర్మే రిక్తకుంభాన్ పరతాన్ సవిత॥ సువ ॥

విధానం-ఫలం : ఏదైనా ప్రత్యేకమైన పనిమీద వెళ్ళేటప్పుడు ముహూర్త శుద్ధికొరకు ఈ పాశుపతప్రయోగం చేసివెళితే విజయం మీదవుతుంది.

## 158. వాజీకరణ పాశుపతం :

యాం త్వా గంధర్వో అఖనద్ వరుణాయ మృతభజే
తంత్వాపయం ఖనామస్యోధిం శేషహర్షణిం ॥
ఉదుషా ఉదుసూర్య ఉదిదం మామకం వచః
ఉదేజతు ప్రజాపతిరవృ్వృషా శుష్మేణ వాజినా ॥

విధానం-ఫలం : ఈ పాశుపతం అగ్నిముఖంగా చేయాలి. రుద్ర సంపుటీ కంతో ఇదిచేస్తే ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయి.

**159. పుత్రప్రాప్తి పాశుపతం :**

"శమీ మశ్వత్థ ఆరూఢః తత్ర పుంసంవనం కృతం
తద్వై పుత్రస్య వేదనం తత్ స్త్రీష్వా భరామసి ॥

**విధానం-ఫలం :** పుత్రప్రాప్తి కొరకు 41 రోజులు ఈ పాశుపతం ప్రయోగించాలి.

**160. మృత్యుంజయ పాశుపతం :**

నమో దేవవధేభ్యో నమో రాజవధేభ్యః
అథోయే విశ్వానాం వధా స్తేభ్యో మృత్యో నమోఽస్తుతే ॥
నమస్తే అధివాకాయ పరావాకాయ తే నమః ॥
సుమత్యై మృత్యో తే నమో దుర్మత్యైత ఇదం నమః ॥
నమస్తే యాతుధానేభ్యో నమస్తే భేషజేభ్యః ॥
నమస్తే మృత్యో మూలేభ్యో బ్రాహ్మణేభ్య ఇదం నమః॥

**విధానం-ఫలం :** అపమృత్యుదోష నివారణకొరకు, జన్మరాహిత్యం కొరకు, రోగ-ఋణరూప మృత్యుగమనానికి ఈ పాశుపతం ప్రయోగిస్తారు.

**161. సూర్య పాశుపతం**

అంగభేదం అశీశమ ఉద్యన్ ఆదిత్యరశ్మిభిః శిర్ష్ణో రోగం అనీనశః
విద్మాశరస్యపితరం సూర్యం శతవృష్ణ్యం ॥

**విధానం-ఫలం :** సూర్యోదయకాలంలో అరుణకాంతిలో ఈపాశుపతం 12 రోజులు ప్రయోగిస్తే ఆరోగ్యప్రాప్తి, సర్వరోగనివారణ, అమృతత్వం లభిస్తాయి.

**162. మనో పాశుపతం :**

అస్తిస్రంసం పురుస్రం సమాస్థితం హృదయామయం బలాంసం

**విధానం-ఫలం :** ఇదొక విచిత్ర పాశుపతం. రోగాలన్నీ మిథ్య (లేకున్నా ఉన్నట్లు కనిపిస్తాయి). మనసును దృఢపరచుకొంటే రోగాలన్నీ మటుమాయమై పోతాయి. 21 రోజులు చేసిచూడండి.

**163. యజ్ఞ పాశుపతం :**

వీహి స్వామాహుతిం జుషాణో మనస్వాహా మనసాదిదం జుహోమి

**విధానం-ఫలం :** నిత్యాగ్నిహోత్రులు నిత్యం కనీసం ఒకమాల 108సార్లు హవనం చేయవలసిన పాశుపతమిది (లేదా ఒకరుద్ర సంపుటాకంలో 180సార్లు హవనం చేయాలి.)

**164. క్రోధ హరణ పాశుపతం :**

అ యం దర్భో విమన్యుకః స్వాయచరణాయ చ
మన్యోర్విమన్యుకస్వాయం మన్యుశమన ఉచ్యతే ॥
అయం యో భూరిమలః సముద్ర మవతిష్ఠతి
దర్భః పృథివ్యా ఉత్థితో మన్యుశమన ఉచ్యతే ॥

విధానం-ఫలం : దర్భ, భూరిమల (వట్టివేళ్ళు) నూరి 41రోజులు అభిషేకం చేస్తే క్రోధం అంతరిస్తుంది. సింధూఫల జలంలో అభిషేకిస్తే భ్రాంతి, ఈర్ష్య అంతమౌతాయి.

**165. ఉన్మాద శాంత పాశుపతం :**

ఇమంమే అగ్ని పురుషం ముముగ్ధ్యం యోబద్ధః సుయతో లాలపీతి ॥
అతోధితే కృణవత్ భాగధేయం యదా నున్మదితో సతి ॥

విధానం-ఫలం : గోరోచనం, కుంకుమపువ్వు, వట్టివేళ్ళ పొడిని జలంలో కలిపి 40 రోజులు అభిషేకించి 41వరోజు హవనం చేయాలి. ఈ పొగ పీల్చడం వల్ల ఉన్మాదం అంతమౌతుంది.

**166. అజాశృంగి పాశుపతం :**

ఏయమగ న్నోషధీనాం వీరుధాం వీర్యావతీ
అజశృంగ్యరాటకీ తీక్ష్ణ శృంగీ వ్యపతు

విధానం-ఫలం : అజాశృంగి పేరుతో పిలవబడే ఈమూలిక, క్రిములను సంహరించడానికి, విషహరణానికి పనికివస్తుంది. 41 రోజులలో ఈమూలిక గంధం తీసి దానిని నీటిలోకలిపి అభిషేకిస్తే ఈ మంత్రం సిద్ధిస్తుంది. త్రిశూల ముద్రప్రదర్శిస్తూ దులుపుతే విషం దిగుతుంది. నీరు మంత్రించి చల్లితే పొలాలో క్రిములు సంహరించ బడతాయి.

**167. ఆసురీ పాశపతం :**

ఇదం ఖనామి భేషజం మాంపశ్య మఖిరోరుదం పరాయతో నివర్తనమాయతః॥

విధానం-ఫలం : ఆసురీ అంటే తెల్లఆవాలు. శంఖపుష్పి, ఆసురీ మూలికలను పతివశ్యానికి స్త్రీలు వాడతారని చెప్పబడింది. కేవలం 11 రోజులలోనే ఈ మూలికా అభిషేకంతో ఫలంసాధించవచ్చు.

**168. దృష్టి దోషనివారణ పాశుపతం :**

దుష్ట్యై హిత్వా భత్స్యామి దూషయిష్యామి కాబవం॥
ఉదాశవో రభాఇవ శపథేభిః సరిష్యథ ॥

విధానం-ఫలం : ఏదైనా గ్రహణంలో రుద్రంలో సంపుటీకరించి ఒకసారి పారాయణం చేస్తే ఈ మంత్రం సిద్ధిస్తుంది. దీనితో దిగదుడుస్తే నీరు మంత్రించి త్రాగించినా ఊదినా దృష్టిదోషం, గాలి ధూళి మొదలైనవి దిగిపోతాయి.

## 169. శత్రుంజయ పాశుపతం

కశ్యపస్త్వా మసృజత్ కశ్యపస్త్వా మవైరమత్ ।
అభిభవస్త్వేంద్రో మానుషే విభ్రత్ సంశ్రేషిణో జయత్ ॥

విధానం-ఫలం : వరణ వృక్షం నుండి తయారుచేయబడే పూస (మణి)ని ఈ మంత్ర రుద్ర సంపుటీకంలో అభిషేకించి ధరిస్తే శత్రువులను జయించవచ్చు. వ్యక్తికి ధైర్యం పెరుగుతంది.

## 170. అగ్నిరుద్ర పాశుపతము

ఓం నమోభగవతే మహాపాశుపతా యాతుల బలవీర్యపరాక్రమాయ త్రిపంచాననాయ, నానారూపాయ, నానాప్రహరణోద్యతాయ, సర్వాంగరక్తాయ, భిన్నాంజనచయ ప్రఖ్యాయ, శ్మశాన భేతాళప్రియాయ, సర్వవిఘ్ననికృంతనరతాయ, సర్వసిద్ధి ప్రదాయ, భక్తానుకంపినే, అసంఖ్య వక్త్ర భుజపాదాయ, తస్మిన్ సిద్ధాయ, భేతాళ విత్రాసినే, శాకినీక్షోభజనకాయ, వ్యాధినిగ్రహకారిణే, పాపభంజనాయ, సూర్య సోమాగ్ని నేత్రాయ, విష్ణ కవచాయ, ఖడ్గ వజ్రహస్తాయ, యమదండ వరుణ పాశాయ, గ్రహనిగ్రహకారిణే దుష్టనాగక్షయకారిణే ఓం కృష్ణపింగళాయ ఫట్, హుంకారాస్త్రాయ ఫట్, వజ్రహస్తాయఫట్, శక్తయేఫట్, దండాయఫట్, యమాయ ఫట్, ఖడ్గాయఫట్, నైరృతయేఫట్, వరుణాయఫట్, వజ్రాయఫట్, పాశాయఫట్, ధ్వజాయఫట్, అంకుశాయఫట్, గదాయఫట్, కుబేరాయఫట్, త్రిశూలాయఫట్, ముద్గరాయఫట్, చక్రాయఫట్, పద్మాయఫట్, ముందాయఫట్, ముండాస్త్రాయఫట్, కంకాళాస్త్రాయఫట్, వృశ్చికాస్త్రాయఫట్, క్షురికాయఫట్, బ్రహ్మాస్త్రాయఫట్, శక్త్యాస్త్రాయఫట్, గదాస్త్రాయఫట్, సిద్ధాస్త్రాయఫట్, గంధర్వాస్త్రాయఫట్, పూర్వాస్త్రాయ ఫట్, దక్షిణాస్త్రాయఫట్, వామాస్త్రాయఫట్, పశ్చిమాస్త్రాయఫట్, మంత్రాస్త్రాయఫట్, శాకిన్యస్త్రాయఫట్, యోగిన్యస్త్రాయఫట్, దండాస్త్రాయఫట్, మహాదండాస్త్రాయఫట్, నమోఽ స్త్రాయఫట్, శివాస్త్రాయఫట్, ఈశానాస్త్రాయఫట్,. పురుషాస్త్రాయఫట్, అఘోరాస్త్రాయఫట్, సద్యోజాతాస్త్రాయ ఫట్, హృదయాస్త్రాయఫట్, మహాస్త్రాయఫట్, గరుడాస్త్రాయఫట్, రాక్షసాస్త్రాయఫట్, దానవాస్త్రాయఫట్, క్షౌం నారసింహాస్త్రాయఫట్,

త్వష్టాస్త్రాయఫట్, సర్వాస్త్రాయఫట్, నఃఫట్, వఃఫట్, ఫీఃఫట్, ఫఃఫట్, మఃఫట్, శ్రీఃఫట్, హ్రీఃఫట్, భూఃఫట్, భువఃఫట్, స్వఃఫట్, మహఃఫట్,జనఃఫట్, తపఃఫట్, సత్యంఫట్, సర్వలోకఫట్, సర్వపాతాళఫట్, సర్వతత్త్వఫట్, సర్వప్రాణఫట్, సర్వనాడీఫట్, సర్వకారణఫట్, సర్వదేవఫట్, హ్రీంఫట్, శ్రీంఫట్, హ్రూంఫట్, స్త్రుంఫట్, స్వాంఫట్, లాంఫట్, వైరాగ్యాయఫట్, మాయాస్త్రాయఫట్, కమలాస్త్రాయ ఫట్, క్షేత్రపాలాస్త్రాయఫట్, విఘ్నేశ్వరాస్త్రాయఫట్, గౌఃగాంఫట్, క్రోం క్రాం ఫట్, హ్రాం హ్రాం ఫట్, భ్రామయ భ్రామయ ఫట్, సంతాపయ సంతాపయఫట్, ఛాదయ ఛాదయఫట్, ఉన్మూలయ ఉన్మూలయఫట్, త్రాసయ త్రాసయ ఫట్, విద్రావయ విద్రావయఫట్, సర్వదురితం నాశయ నాశయ ఫట్.

విధానం-ఫలం : స్వాయంభూ మన్వంతరంలో అవ్యక్తం నుండి వ్యక్తమైన అగ్ని అభిమానదేవత. స్వాహాను మోహించాడు. వారికి పవమానుడు, పావనుడు, శుచి అనే పుత్రులుకలిగారు. పవమానుడు వ్యాహృతులలో మొదటిదైన భూర్-(భూమి మీద అగ్ని, పావనుడు-భువః అనే అంతరిక్ష అగ్ని, శుచి సువః అనే ద్యులోకం (సూర్యలోకం) లో అగ్ని. భూలోక అగ్ని పవమానుడికి నిర్మథ్యాగ్ని అనే అరణి మథనంలోనుండి ప్రకటమయ్యే అగ్ని జన్మించాడు. ఇలా 49 రోజులలో ఉండే అగ్ని సౌరతేజం, వాయుశక్తి కలిస్తే ఆ తత్త్వాన్ని రుద్రుడంటారు. అటువంటి అగ్ని రుద్ర పాశుపతం (అగ్నిపురాణంలోని) అప్రతిహతమైంది ఇక్కడ ఇస్తున్నాము.